# స్ఫూర్తి

(వ్యాస సంకలనం)



సంపాదకులు :

ఎస్. వెంకటేశ్వరరావు

పి. చంద్రశేఖర అజాద్

స్నేహ సాహితి

శివాలయం వీధి : : విజయవాడ - 1

స్ఫూర్తి (ప్రముఖ రచయితల సంకలనం)

సంపాదకులు :

యస్. వెంకటేశ్వరరావు

పి. చంద్రశేఖర్ ఆజాద్



ముఖచిత్రం :

బాలి



వెల :

**6.00**

ప్రథమ ముద్రణ :

జనవరి 1981

ముద్రణ :

శ్రీ సీతారామ ప్రింటర్స్

విజయవాడ - 3.

# ఈ సంకలనంలో...

# "స్నేహసాహితి" విజ్ఞప్తి....

ఈరోజున సాహితీ ప్రపంచంలో ఓ విచిత్రమైన పరిస్థితి ఆవరించు కొనిఉంది, అనవసరపు "వినోదాల" సృష్టి ఎక్కువగా జరుగుతోంది. "సిద్ధాంతరాద్ధాంతాలే" ప్రధానంగా చోటు చేసుకుంటున్నాయి. వ్యక్తులు "సంస్థలు" కలాలతో "ముష్టి" యుద్ధం చేస్తున్నారు. ఏ "రచయిత" రాసిన రచనైనా అతని "సంస్థ" సభ్యత్వాన్నిబట్టి.... లేక అతని రాజకీయ అభిప్రాయాల్ని బట్టి అంచనా వేయటం జరుగుతోంది. రచనలో ఉన్న అభ్యుదయ దృక్పథాన్ని అయినా గుర్తించకుండా పూర్తిగా తిరస్కరించ టం జరుగుతోంది. 'విమర్శ'లో యాంత్రిక దృక్పథం చోటుచేసుకొంటుంది. 'గ్రూపు' రాజకీయాలు సాహితీ....సాంస్కృతిక రంగాల్ని ఆవరించుకొని ఉన్నాయ్! ఇటువంటి పరిస్థితుల్లో....వ్యక్తులు....సంస్థలు ఎంతగా కృషి చేస్తున్నా....అది అత్యంత ప్రాథమిక దశలోనే ఉండటం జరుగుతోంది.

స్నేహసాహితి ఇలా అంటున్నదంటే లోపాల్ని గుర్తించమనటంకాదు. "నిజమైన శత్రువుల్ని" గురించి విమర్శించకుండా ఉండాలని కాదు. సాహితీ ఉద్యమం అనేక విధాలుగా చీలి ఉన్న నేటి తరుణంలో "చర్చలు.... విమర్శలు....సూచనలు...." స్నేహపూర్వక వాతావరణంలో జరగాలనే మా ఆరాటం. 'సిద్ధాంత' పోరాటాలు....'చర్చలు....అనంతం అనే అవ గాహన 'స్నేహసాహితి'కుంది. అయితే అవే ప్రధానం కాకూడదు.

నేడు సాహితీరంగాన్ని ఏలుతున్న అనేకరకాలైన దుష్ట పరిణా మాన్ని... చైతన్యవంతంగా ఎదుర్కోవాలి. అందుకు ప్రజారచయితలు.... కవులు... కళాకారులు....ముందుకు రావాలి. నిరంతరకలం సైనికులుగా రూపొందాలి. ఈ విషయంలో మరోసారి శ్రీ కొడవటిగంటి కుటుంబరావు గారిని ఆదర్శంగా తీసుకొని ఉద్యమించాలి.

కళలూ, సాహిత్యం ప్రజలవి..

వాటిని ప్రజల నడుమకు తీసుకువెళ్ళటమే ప్రజారచయితల, కళా కారుల కర్తవ్యం.

# "స్ఫూర్తి గురించి ఓ నిమిషం"

"ప్రపంచ తెలుగు మహాసభల" సందర్భంగా ఆంధ్రదేశంలోని యువరచయితల, కళాకారుల రచనల్ని... అలాగే నేడు ఎన్ని విబేధాలున్నా సాహితీ ఉద్యమాల్ని నిర్వహిస్తున్న వ్యక్తుల సంస్థల ప్రముఖులనుండి వివిధ సాహితీ విషయాలకు చెంది వ్యాసాలను ప్రచురించాలని నిర్ణయించుకొన్నాం. ఈ సమయంలో "ప్రపంచ తెలుగు మహాసభల్ని" ఓ 'సందర్భంగా' మాత్రమే నిర్ణయించుకొన్నాం. కానీ వాటిమీద స్నేహసాహితీకేం భ్రమలు లేవు. అయితే కొందరు సూచించిన పిమ్మట.... ఓ సందర్భంగా అయినా సరే "ప్రపంచ తెలుగు మహాసభల్ని" నిర్ణయించుకోవటం సరయియింది కాదని నిర్ణయించుకొని వాటిని బహిష్కరిస్తూ ప్రకటించాం. ఈ ప్రకటనలను ప్రచురించిన పత్రికల వారందరికీ మా కృతజ్ఞతలు.

యువరచయితలకు విజ్ఞప్తి చేస్తూ.... "జన జీవితానికి సంబంధించిన వాస్తవమైన విషయాల్ని చైతన్యవంతంగా చిత్రించే రచనలు" చేయాల్సిందిగా కోరాం. విచారించవలసిన విషయం ఏమంటే మా కటుపంటి రచనలేవి అందలేదు. కొందరి ఉత్సాహం తప్పించి.... ఆ రచయితల్ని మేం పరిచయం చేస్తున్నాం. యువరచయితల చైతన్యవంతమైన రచనల్ని.... మరోసారి సేకరించి ప్రచురించాలని నిర్ణయించుకొన్నాం.

అడిగిన వెంటనే ఏ పారితోషికం ఇవ్వకపోయినా తమ అమూల్యమైన వ్యాసాలు పంపిన రచయితలందరికీ మా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఇంకా కొందర్ని వ్యాసాలకోసం అడిగాం. కొందరు తీరికలేక రాయకపోవటం జరిగింది. అనేక అడ్డంకుల నెదుర్కొని మీ ముందుకు ఈ రోజు "స్ఫూర్తి" రావటం జరిగింది. దీనివలన ఏమాత్రం ప్రయోజనం కల్గినా మా కృషి కొంతవరకు సఫలం అయినట్లే .... ఈ ప్రచురణను ఆదరించే తీరునుబట్టి 'స్నేహసాహితి' మరిన్ని విషయాలపై పుస్తకాల్ని ప్రచురించాలని నిర్ణయించుకొంది.

"స్ఫూర్తి" బయటకు రావటంలో సహకరించిన అందరికీ మరోసారి కృతజ్ఞతలు....

"స్ఫూర్తి"పై మీ అభిప్రాయాల్ని ఎల్లవేళలా ఆహ్వానిస్తున్నాం.

(డైరెక్టర్ : స్నేహసాహితి)

# అంకితం

శ్రీ॥ శే॥ కొడవటిగంటి కుటుంబరావుగారికి ...

మనస్ఫూర్తిగా ఈ "స్ఫూర్తి"

- స్నేహ సాహితి

# సమాజాన్ని మార్చడంలో సాంస్కృతికవిప్లవం నిర్వహించేపాత్ర

**జ్వాలాముఖి**

ప్రతి సమాజం తన ఆర్థికనీతి కనుగుణంగానే తన సంస్కృతిని నిర్వచించి పెంచి పోషిస్తుంది. అందువల్ల సంస్కృతిగురించి ఆలోచించే ప్పుడు దాని పునాది ఐన ఆర్థికనీతిగురించి ఆలోచించడం తప్పనిసరి.

వేషభాషలు, ఆచారవ్యవహారాలు, పుట్టుక పెళ్ళి చావు సందర్భాల్లో ప్రవర్తించే తీరుతెన్నులు, విశ్వాసాలు వగైరా, దైనందిన జీవన సాంఘిక నియమాలే సంస్కృతిగా వారసత్వపు బాధ్యతగా సమాజంలో నిర్వహింప బడతాయి. వీటిని పాలకవర్గాలు నిర్ణయిస్తాయి. గెలిచిన పక్షపు జీవిత విధానమే సంస్కృతిగా అలరారుతుంది.

సమాజం పరిణామ శీలి. వైరుధ్యాల సంఘర్షణల ఫలితంగా సమాజంలో మార్పును మనం గమనిస్తాం. అది సాంఘీకంగా మొదట కనిపించిన రాజకీయంగా చట్టరూపంధరించినా దాని వెనక ఒక ఆర్థికనీతి వుంటుంది. దీన్ని విజేతలు నిర్ణయిస్తారు.

"స్త్రీ పునర్వివాహసమస్యనే తీసుకుందాం. దీన్ని పనికిరాదన్నారు

ఛాందస్తులు. శాస్త్రసమ్మతంకాదనీ వాదించారు. కానీ దానివెనకవున్న ఆర్థిక రహస్యం ఏమిటి? ఆ భర్తతాలూకు ఆస్తికి సంబంధించిన వారసత్వపు తగాదా, స్త్రీ మళ్ళీ పెళ్ళిచేసుకుంటే పిల్లలతోపాటు కొత్త భర్తదగ్గరకి వెళ్తుంది. పూర్వపు భర్తతాలూకు అన్ని హక్కులూ ఆమెకు పోతాయి.) [ఇది ఎంతవరకు చిత్తశుద్ధితో జరుగుతుందనేది వేరే విషయం] అలా వివాహం చేసుకోకపోయినట్లయితే ఆమె ఉన్నచోటే పడుంటుంది. ఆమె అత్తగారి తాలూకు బంధువులు ఆమె భర్తఆస్తిపాస్తుల్ని అనుభవిస్తారు. ఆమెకు ఏదో కూడు పడేస్తారు. వెట్టిచాకిరి చేయించుకుంటారు. చాటు మాటుగా ఆమెను అన్నివిధాలా లొంగదీసుకుంటారు. [తండ్రి ఆస్తిలో కూడా ఆమెకు వాటా నిన్నమొన్నటిదాకా వచ్చేదికాదు. 1956]

అలాంటి స్త్రీకి కేవలం "పునర్వివాహం" అనేది ఒక్కటే సమస్య కాదు. దానితోబాటు సాంఘిక భద్రత చాల ముఖ్యం. ఈ విషయాన్ని పునర్వివాహమంత ముఖ్యమైన విషయంగా వీరేశలింగం పంతులుగారు ఆలోచించలేదు. మళ్ళీ పెళ్ళిచేసుకునే హక్కును సంపాదిస్తే తీరిపోతుం దనుకున్నారు అది మంచిదేకాని, దానితో మొత్తం సమస్య తీరిపోలేదు. "సాంఘిక భద్రత" అనేది మొత్తం సమాజపు ఆర్థికనీతిమీద ఆధారపడి వున్న వాస్తవం. అది పాలకవర్గ ఇష్టారాజ్యం.

సాంఘిక దురాచారాలనేవి చాలామట్టుకు మధ్యతరగతి పైతరగతి (ఆస్తివున్నవాళ్ళుగావుండే)వాళ్ళ ఆస్తి గతసంబంధాల సాంఘికవికారాలు. వెనకటికి స్త్రీ సహగమనాన్ని మరుదులు అత్తవారు ప్రోత్సహించేవారు. కారణం ఆమెతాలూకు ఆస్తి వారికి దక్కేది. అలాగే ఉత్తరాదిలో కురు క్షేత్ర ప్రాంతాల్లో అన్న పోయాక తమ్ముడు వదినను పెళ్ళి చేసుకుంటాడు. కారణం తమ కుటుంబఆస్తి అన్యాక్రాంతం కాకుండా చూసుకోవటం.

మన సమాజంలో అన్నిదురాచారాలు స్త్రీ చుట్టూ ఎందుకువున్నాయి? ఆడపిల్ల పుట్టగానే చంపివేయడం (రాజస్థాన్) సతీసహగమనం. ఇనప కచ్చడాలు. బసవి దేవదాసి పద్ధతులు కన్నెచెర, వేశ్యావృత్తి కన్యాశుల్కం వరకట్నం వగైరా, ఇవన్నీ మధ్యతరగతికి రాత్రులు, పైతరగతి ఇష్టా

రాజ్యాలు, ఇందులో సతీసహగమనం అంతరించింది. కాని ఈ మధ్య అక్కడక్కడ జరుగుతున్నట్లు వీరవార్తలు. ఎందుకీదురాచారాలున్నట్లు? "స్త్రీ"నిగురించి ఈ సమాజానికున్న స్థిరాభిప్రాయం ఏమిటి?. స్త్రీకి సొంత వ్యక్తిత్వంలేదు. ఆమెను మారక ద్రవ్యంలా వినియోగించవచ్చు అని ఆస్తిగత హక్కుపదార్థంలా స్త్రీ చూడబడుతుంది. పై వర్ణాల్లో స్త్రీ పునర్వివాహం ఇప్పటికీ పరిష్కారంగాని సమస్య. "[తలలు బోడులుఅయిన తలపులు బోడులవునా"]

ఈ సమస్యలన్నీ ఇంత వికారంగా క్రింది శ్రమజీవుల్లోలేవు. వారు సులభంగా విడాకులిచ్చుకోగలరు. పునర్వివాహం చేసుకోగలరు. కారణం వారు దైనందిన జీవనపోరాటంలో సమరశీలురు. స్త్రీ పురుషులుభయులు జీవితమంతా పోరాడి పొట్టపోసుకుంటారు. ఆ మేరకే వారి కులనియమాలు సాంఘీకాచారాలుగా ఏర్పడతాయి. వారు జీవితానికి దూరంగా వుండరు. ఆటవిడుపుగా జీవించరు. స్త్రీ పనిచేయడమనేది కింది శ్రమజీవులకు ఒక అవసరం. అదే పైవారికి స్త్రీ కేవలం అనుభవైక పదార్థం. కడపదాటరాదు. లేచి పారిపోతుంది. ఈ వికృత పరిణామాలవెనుక స్త్రీని ఒక వినియోగ వస్తువుగా చూసే ఆస్తి గత దుర్మార్గం పై వర్గాల్లోవుంది, ఆస్తి భద్రతకు సంబంధించిన కేంద్రీకృత మీరమే స్త్రీని బానిస చేయడం. దీని ప్రభావక ఇంతవరకు క్రింది వర్గాలపైనా పడకపోలేదు. పితృస్వామిక కుటుంబాల యజమాన్యాధికారం ఏదోరూపేణా స్త్రీమీద ఇది కొనసాగుతూనేవుంది. ఈ ఫ్యూడల్ వికారం విడిగా పరిష్కరింప ఒకే సమస్యకాదు. అలా విడిగా స్త్రీస్వాతంత్ర్యాన్ని సాధించవచ్చని సంస్కర్తలు విఫలులయ్యారు. చలంలాంటి అరాచకునికి స్త్రీ సెక్సు స్వేచ్ఛే స్వేచ్ఛగా తోచింది. బాల్యం లోనూ వృద్ధాప్యంలోనూ స్త్రీ వుంటుందని, యవ్వనంలోని స్త్రీకి కోరిక కలగడానికి ముందు, తీరేటప్పుడు, తీరాక, పొట్టసమస్య చాలా ప్రధానమని పాపం గుడిపాటివెంకటచలానికి తెలియదు. అవయవాల స్వేచ్ఛే స్త్రీ స్వేచ్ఛ కాజాలదు. ఈ పై వర్గాల సంక్షోభాన్ని కిందివర్గాలస్త్రీలు జీవనసమరంలో సులభంగా పరిష్కరించుకున్నారు.

అందువల్ల స్త్రీకి సంబంధించిన సమస్త అభిప్రాయాలు సాంఘిక వికాసంతో మురికిపడి వున్నాయి. అందుకు ఆర్థికవ్యవస్థమారాలి, వ్యక్తిగత ఆస్తి పోవాలి. అందరికి చేతినిండాపని ఒంటినిండాగుడ్డ ఉండటానికి ఇల్లు జ్ఞానం పెరగటానికి శాస్త్రీయ విద్యావిధానం కావాలి. అది సోషలిస్టుసమాజంలోనే సాధ్యం. మరి అంతవరదాకా స్త్రీకి సంబంధించిన సంస్కరణలు వుండకూడదా ఎందుకు వుండకూడదు? తప్పనిసరిగా ఉండాలి. ఆ సంస్కరణలు సమాజానికి పరివర్తనకు సాగుతున్న సాంఘిక ఆర్థిక రాజకీయవర్గ పోరాటాలకు లోబడివుండాలి.

పురుషధిక్యతా భావానికి స్త్రీ ఆధిత్యతభావం జవాబుకాదు. ఫ్యూడలిజానికి క్యాపిటలిజం ప్రత్యామ్నాయంకాదు. అలా సహజంగా వచ్చే మార్పులో సోషలిస్టు బీజాలుజనాటాలి. స్త్రీపురుషులిర్వురు జీవనపోరాటంలోనూ సాంఘికపోరాటంలోనూ అంతిమంగా రాజకీయవిముక్తి పోరాటంలోనూ సమానముగా పాల్గొని సమరశీలురుకావాలి. అప్పుడు హెచ్చుతగ్గులుండవు. ఇది ముఖ్యంగా మధ్యతరగతి ప్రజల్లో అమలుజరిగేట్లు పోరాటకార్యక్రమాలు చేపట్టాలి. ఉద్యోగసంఘాలు కోనుగోలుదార్ల సంఘాలు అధికధరలకు వ్యతిరేకంగా జరిగే ప్రజా పోరాటాలో భార్యాభర్తలిరువురు తెగించి దుర్మార్గపు వ్యవస్తతో పోరాడాలి. అప్పుడు ఎవరుగొప్ప ఎవరుచిన్న అనే పోటీపోయి స్త్రీ పురుషులిర్వురూ సాంఘీక వికాసంలో నిర్ణయ శక్తుల్లో ఒకభాగంగా అభివృద్ధి చెందుతారు.సహజీవన సమస్యను సులభంగా పరిష్కరించుకున్న కార్మికవర్గ దీర్ఘకాలిక విముక్తిపోరాటంలో మధ్యతరగతి భార్యాభర్తలు విలీనం అవుతారు. "డీక్లాస్" కానంతవరకు మధ్యతరగతివాళ్ళ సమస్యల్ని ఎవరూ పరిష్కరించలేరు. వాటెని సమాజంలో విడిగా చిట్కాలులేవు. వారు పైతరగతివాళ్ళచేతుల్లో పావుకాయలుగా వినియోగపడకుండా చూచుకోవాలంటే వారు ఇంటా బయటాతెగించి పోరాడాలి. పోరాడే సాంఘీకశక్తులలో విలీనంకావాలి.

అలాగే దేవుడు, మతం, మూఢవిశ్వాసాలకు సంబంధించిన అభి

వృద్ధి నిరోధక భావాలున్నాయి. ఇవి జీవనవికాసాన్ని సాంఘికపరిణామాన్ని అడ్డుకుంటాయి. మధ్యతరగతి ప్రజలు దీనికి బలైనంతగా మరెవ్వరుకారు. పైవారికన్నీ కొనుగోలు పదార్థాలే కిందివారికి సంఘర్షనమయజీవితమే సర్వరోగనివారిణిగా నిలుస్తుంది.

దేవుడు, మతం, కులం, ఆచారాలు, మూఢవిశ్వాసాలు, నిలువు దోపిడికి స్వార్థపరవర్గం సృష్టించిన ఎండమావులప్రజల సమస్యలమీద సంఘటిత పక్షకుండాచేసే దుర్మార్గులు, అందరూ దేవుని బిడ్డలే అయిన ప్పుడు గత యాభైఏళ్ళగా (ఇంకా ఎక్కువగానే) హిందూ, ముస్లిం ఒకర్ని ఒకరు ఎందుకు చంపుకోవాలి?) ఇక్కడ వారి దేవుడు ఏమైనట్లు? అంతా దొంగనాటకం, హిందూ ముస్లింసోదరులు కలిసిమెలసివుంటూ జాతి జీవితం గురించి ఆలోచిస్తే ఇప్పటి దుర్మార్గపాలకుల సింహాసనాలు కూలి పోతాయి. కాబట్టి వారిద్దరూ "లౌకికరాజ్యం" వికారంగా చంపుకోవాలి. ఇదే కాంగ్రెస్‌వారి వుద్యోగం, పురజనులమీద జరుగుతున్న విలయ తాండవం, ఇది కులసమస్యకాదు, ఇది పీడితుడు పీడితునిమధ్య సాగుతున్న అనాధి వర్గపోరాటం, దాన్ని కేవలం కులసమస్యగా మాత్రమేచూపించి సొమ్ము చేసుకుంటున్నారు. పాలకవర్గంవారు. పాపం అలాగే అనుకొని కర్ణునిలా హుంకరించి, ఏకలవ్యుని లాగారు. భక్తిని ప్రదర్శించి పాలక వర్గానికి ఇంగితాన్ని బలిఇచ్చి బలాదూర్లయ్యారు. అంబేద్కర్, హరిజను లని ముద్దుపేరు పెట్టి ఆకలిని ఆధ్యాత్మకరించారు బిర్లాలగాంధి, రిజర్వేషన్ల యెడారిలో మజిలీలకు కక్కుర్తిపడి గమ్యాన్ని మరిచారు, దళితసోద రులు

అసలు హరిజనసమస్య అనేది భూమియాజమాన్యాధికారానికి సంబం ధించిన వర్గపోరాటసమస్య, నిన్నటి కీలవేన్మణికానీయండి, నేటి బంజావాల నారాయణ్‌పూర్ భోజిత్‌పూర్ బీహార్ తదితర ప్రాంతాలు హరిజన పోరాటాలు కానీయండి) అన్నీ వ్యవసాయ విప్లవాన్ని వేగంచేసే భూమీ సమస్యలేకాని వాటిని కులసమస్యగా చిత్రించి అసలుసమస్యను పక్కదారి

పట్టించటానికి వికృతసాహసం చేస్తున్నారు. పాలకవర్గంవారు. దమనందలి దేవుని బిడ్డల్ని వరించింది.

శ్రమ విభజన పేరిట, పై వర్గాల దోపిడికోసం చాతుర్వర్ణ్య విధానం ఏర్పడింది, దాని వృశ్చిక సంతానమే "కులవ్యవస్థ" దీని పరిష్కా-ర "శ్రమ దోపిడి నిర్మూలన" లో వుంది. "శక్తికొద్ది పని- పనికొద్ది ఫలితం" అలాగే "ఉత్పత్తి సాధనాలైన పంటపొలాలు ఫ్యాక్టరీలు సమాజపరం కావాలి" వ్యక్తి ఆస్తులుగా ఉండరాదు, దానితోపాటు "ఉత్పత్తి పంపిణీ" కూడా జాతిపరంగానే జరగాలి"——ఇలా జరగనంత కాలం ఇటు సాంఘిక సమస్యగా ఘనీభవిస్తున్న కుల వ్యవస్థగాని అటు జాతీయ సమస్యగా పెరిగిపోతున్న ఆహార సమస్యకాని పరిష్కా-రం కాజాలవు—— పాలక వర్గంవారు పీడితుల్ని కొంతకాలమే మోసం చేయగలరు కాని ఎల్ల కాలం మోసం చేయలేరు——

ప్రకృతిపట్ల, జీవితం పట్ల, సమాజం పట్ల, ఎదురయ్యే ప్రతీ సమస్య పట్ల శాస్త్రీయ దృక్పథాన్ని ప్రబోధించాలి. ఆ మేరకు శాస్త్రీయ విద్యావిధా, నలే ద్వారా ముమ్మరంగా ప్రచారంచేయాలి. కాని శ్రమదోపిడి చేసే ఈ పాలక వర్గం అలా చేస్తుందా? చేయదు. కాకపోగా ప్రజల్లో మూఢనమ్మకాలు చెలరేగేట్లు చేస్తుంది. దానిఫలితమే బాబాలు అమ్మలు శంకరాచార్యులు రకరకాలకొత్త దేవుళ్ళు (మంత్రాలయం అయ్యప్ప) తిరుపతి గుండ్ల,గంగా తాయెత్తులు రాగి కడియాలు, శనివారాలు, ఉపవాసాలు, వ్రతాలు, యజ్ఞాలు అర్చనలు, టెంకాయలు, జోతిష్యాలు, మంత్రదండాలు,

ఎందుకీ సంక్షోభం? తన జీవితానికి తాను బాధ్యుడు కాదనే గుడ్డి నమ్మకం తద్వారా సంక్షోభంలోపడ్డ బలహీనుడు తన దరిద్రానికి కారణం తన పూర్వజన్మ వికృతం అని భావిస్తూ దాని నివారణకు పొర్లు దండాలు పెడుతున్నాడు- అలా పెట్టేట్లు చేస్తుందీ దోపిడీ సమాజం. కర్మ సిద్ధాంతం జన్మవల్లే ఒకడు గొప్ప చిన్న అనే అదృష్టజాతకం- "మోక్షం" అనే మాయాబజారు, ఈ జాతిని నిర్వీర్యం చేశాయి. అలా నిర్వీర్యం చేయడానికి పై వర్గాల శ్రమదోపిడి సరికొత్త పథకాలు వేసింది. యజ్ఞాలన్నది

కర్మకాండ అన్నదీ. లలాటలిఖితం అన్నదీ. పూర్వజన్మ ఫలితం అన్నదీ. దైవనిర్ణయం అన్నది. కడకు శ్రమజీవుల్ని శాశ్వత బానిసలుగా మార్చింది. పాలకవర్గాలు వారసత్వపు శాసకులుగా స్థిరపడ్డారు. ఆ మేరకే "స్మృతి" శాసనాలు [మను, యాజ్ఞవల్క్య, పరాశర, దయాభాగమితాక్షరస్మృతులు వెలిశాయి. ఈ పరిణామ వికృతమే సంస్కృతిని "ప్రజా వ్యతిరేక సంస్కృతి"గా పెంచి పోషించింది.

ఇప్పుడు ఈ "ప్రజావ్యతిరేక సంస్కృతి"ని మార్చాలంటే ఒక్కొక్క సమస్యను విడివిడిగా మార్చగలమా? స్త్రీకి సంబంధించిన దురాచాలన్ని పోగొట్టడానికి రాజారామ్మోహనరాయ్ దగ్గరనుండి వీరేశలింగం పంతులు గారి వరకు పోరాడారు. కాని స్త్రీ సమస్య ఏదో రూపంలో మళ్ళీ తలెత్తుతూనే వుంది. కారణం? ఈ సమాజంలో "స్త్రీ"కిసంబంధించిన అభిప్రాయ మూలికలగా మారాలి. "స్త్రీ" అనుభవైక పదార్థం కాదు. ఒకడు పొంది దాచుకొని దోచుకునే ఆస్తి కాదు. స్త్రీకి స్వయం నిర్ణయాధికార హక్కు కావాలి. దీని అర్థం చలంగారి విశృంఖల విహారం కాదు. తద్వారా మోస పోయేది తిరిగి ఆమెనే. సమాజాభివృద్ధికోసం జరిగే పోరాటంలో భాగంగా స్త్రీ అభివృద్ధి చెందేట్లు అందులో పాల్గొనేట్లు చూడాలి. స్త్రీ సమాజానికి అతీతమైన వ్యాధీ, వార్ధక్యంలేని రంభా కాదు. సమాజాన్ని పీడించే కొత్త దయ్యమూ కాదు. ఈ సమాజంలో అన్ని దోచుకోబడిన దుఃఖిత. అలాగే మతమౌఢ్యాలకు వ్యతిరేకంగా బుద్ధుని నాటినుండి దయానంద సరస్వతి వరకు, పోరాడారు. ఇటీవల "దేవుడు లేడు" అనే భావాన్ని ప్రచారం చేయడానికి పెరియార్ రామస్వామి, గోరా, ఎగబడిపోరాడారు. ఎందుకు విఫలమయ్యారు? తుమ్మ ముళ్ళను కత్తిరించడానికే ఈ సంస్కర్తలు పూనుకున్నారు కాని తుమ్మచెట్టును వేళ్ళతో పెరికివేయడానికి పూనుకోలేదు. బుద్ధుడు విఫలమైన చోటే వీరి జిజ్ఞాస పుట్టి సాంఘిక తర్కంగా పెరిగి ఆర్థిక వైఫల్యంగా ఒరిగి, రాజకీయ నైరాశ్యంగా నాశనమైంది. కొత్త సూత్రాలు కొత్త వైష్ణవాలయ్యాయి.

అందువల్ల సాంస్కృతిక విప్లవం అనేది సాంఘిక విప్లవానికి భిన్న

అందువల్ల స్త్రీని బానిసగా చూసేది, దేవుని సృష్టించి భ్రమలు కల్పించేది, మతవిశ్వాసాలు మూఢనమ్మకాలు పెంచి కొల్లగొట్టేది, జన్మ కర్మ మోక్ష భావాలు పెంచి జనాన్ని గొర్రెల మందగా మార్చేది, హక్కుల కోసం సంఘటితపడే శ్రమజీవుల్ని కులాలకింద విడగొట్టే కుట్రస్వభావం కలది, ఈ భూస్వామ్య విధానం" - దీని స్వభావం "శ్రమ దోపిడి" దాని తాత్విక శబ్దాలే "సేవ" "కులం" "కర్మ" చివరకి "త్యాగం" కూడా ఇవన్నీ పేదల్ని అమాయకుల్ని స్త్రీలని కొల్లగొట్టే ఆధ్యాత్మిక గుడారాలు· వీటిని నాశనం చేయాలంటే 'భూస్వామ్య విధానం నాశనం కావాలి'-

భూమి మీద యాజమాన్యం ఏ కొందరిదో ఇక మొత్తం జాతికి సంబంధించినదిగా వుండాలి. ఆ మేరకు శ్రమజీవుల న్యాయకత్వంలో రైతాంగం, వివిధ వృత్తుల వాళ్ళు దు:ఖితులు దీనులు స్త్రీలు, పీడితులు సంఘటిత పడి "భూమి కోసం" పోరాడాలి. దాని విజయమే అన్ని అరిష్టలు నాశనం చేయగలదు·

కొందరు మేధావులు, లేదా హేతువాదులు నాస్తికులు, కులనిర్మూలన కోరేవారు, స్త్రీ హక్కులు చాటేవారు, వర్గపోరాటంతో సంబంధం లేకుండా ఈ సమస్యలు విడిగా సాంఘిక అంశాలుగా ముందుకుతెచ్చి సంస్కరణలు కావాలంటారు. ఎప్పుడైతే ఈ విడి కార్యక్రమాన్ని లేదా అతీత కార్యక్రమాన్ని చేపడతామో పోరాడే శక్తుల్లో గందరగోళం ఎర్పడుతుంది. అనైక్యత ప్రబలుతుంది. "బండి ముందా? గుర్రం ముందా?" అనే మీమాంస బయలుదేరుతుంది. ముందు ప్రయాణం ఎక్కడికనేది తేలాలి? ఆ తర్వాత ఎలా అనేది నిశ్చయించుకోవాలి? దారి పొడుగునా అడ్డంకుల్ని అధిగమిస్తూ గమ్యాన్ని చేరాలి. ఇదే "విముక్తి" ఇది ఏ ఒక్కరిదో ఇద్దరిదో, నల్గురిదో, లేదా సమాజంలో ఒక తరగతిదో కాక, మొత్తం జాతికి సంబంధించిన "విముక్తి"గా ప్రజ్వలిస్తుంది. ఇది కేవలం సాంఘికంగానే గాక రాజకీయంగా పరిణతి చెందుతుంది. ఆర్థికంగా వ్యవస్థలో సమూలమైన మార్పును తెస్తుంది.

ఇది విప్లవాలయుగం, సంస్కరణవాదానికి కాలం చెల్లిపోయింది.

వ్యవస్థనలాగే వుంచి పైపై మార్పులు కోరేది సంస్కరణవాదం, దీనివల్ల లాభం లేదని తద్వారా సమస్య పరిష్కరింప బడకపోగా అది అధునికంగా మారి అభ్యుదయానికి అడ్డంకిగా నిలుస్తుందని చరిత్ర తేలిపోయింది. సంస్కరణవాదం సాంఘిక సమస్యను కేవలం సాంఘికంగానే చూసి, ఆర్థిక స్వభావం నుండి దాన్ని వేరుచేసి, రాజకీయ లక్ష్యాన్ని దెబ్బతీస్తుంది. అందువల్ల సంఘంలోని సమస్య సంఘపరంగానే మారాలి. వ్యక్తి విశేషంగా ప్రచారంకారాదు. మళ్ళీ సంస్కర్తలు పుడతారే కాని పరిష్కర్తలు కనపడరు. లోకంలోని శోకానికి అంతుండదు. దుఃఖం మనవారికి ఒకరసం "ఏరసఃకరుణఏవ"

అయితే సంఘం సమూలంగా మారేదాకా సాంఘిక దురాచారాలు అలాగే వుండాల్సిందేనా? ఎప్పటికీ కాదు. స్త్రీలు బానిసలుగా బాధపడాల్సిందేనా? దేవుడు దయ్యమై పీడించాల్సిందేనా? మతాలకుమ్ములాటలు కొనసాగాల్సిందేనా? కులవ్యవస్థ జాతిని నిర్వీర్యం చేయాల్సిందేనా? వగైరా యక్షప్రశ్నలు మనల్ని సతమతం చేయాల్సిందేనా! అనేది మన ముందున్న తక్షణ కర్తవ్యం.

తక్షణ కర్తవ్యం శాశ్వత కర్తవ్యాన్ని గల్లంతు చేయరాదు. రెంటికీ మధ్య స్వార్థపరులు వైరుధ్యాన్ని సృష్టిస్తారు. మనం వాటిమధ్య సమన్వయాన్ని సాధించాలి.ఎలా? తక్షణ సమస్యలో శాశ్వత సమస్యలో భాగంగా చూచి ఆ పరిధిలోనే పరిష్కరించే ప్రయత్నం చేయాలి. సంస్కరణలో ఒక భాగంగా వర్గపోరాటంలో ఒక అంశంగా విప్లవంలో ఒక రంగంగా చూడాలి. ఆమేరకు పోరాడాలి. భావవిప్లవం రాజకీయ విప్లవానికి పూర్వరంగాన్ని సృష్టిస్తుంది. రాజకీయ విప్లవం తర్వాత మొదటి భావ విప్లవం విలువల్ని సమూలంగా మార్చే సాంస్కృతిక విప్లవంగా మార్చుతుంది. అందులోని విప్లవాల క్రమం ఒక జాతి జీవితానికి ఊపిరి.

"భూమి కోసం" పోరాడే రైతులకు "భుక్తికోసం సంఘర్షణలోకి దిగిన శ్రామికులకు "విముక్తికోసం" దీర్ఘకాలిక వర్గపోరాటాన్ని

చేపట్టిన ప్రజలకు అవగాహనలో గమ్యం స్పష్టం అవుతుంది. ఆ మేరకా గమనంలోని రకరకాల ఆటంకాలు, స్త్రీ పురుష సంబంధాలు, వివాహాలు, చావు పుట్టుకలు, విశ్వాసాలు, పోరాట జీవన భాగస్వామ్యంగా అవగత మవుతాయి. ప్రకృతిపట్ల, జీవితంపట్ల, సమాజంపట్ల, ప్రపంచంపట్ల, సామాజిక దశలపట్ల శాస్త్రీయ దృక్పధం ఏర్పడుతుంది. ప్రతివారిలో ఆత్మ విశ్వాసం పెరుగుతుంది. ఒకరికి ఒకరు సహకారం చేసుకోవాలనే ఆత్మీయత పెరుగుతుంది. సహజీవనం సాంఘిక బాధ్యతగా అభివృద్ధి చెందుతుంది. పరస్పరవిశ్వాసం అభివృద్ధిచెంది విభిన్నరంగాల ప్రజలమధ్య సంఘీభావంఅలవడుతుంది. మొత్తానికి మానవస్వభావంలోనే మౌలికమైన మార్పు వస్తుంది. నిన్నటిచింత, నేటి సంక్షోభం రేపటి భయం వారిని అధిగమించజాలదు. కారణం వారు "వ్యష్టితత్వం" నుండి విడివడి "సమిష్టితత్వం" లోకి పరిణతి చెందుతారు.

ఇలా ఎక్కడైనా జరిగిందా? ఎందుకు జరగలేదు? అక్టోబరు విప్లవ కాలంలో ప్రజలు ఎలా రాటుదేలారు అంధవిశ్వాసాన్ని అధిగమించారు జన చైనాలో లాంగ్‌మార్చ్ కాలంలో ఎలా రకరకాల ప్రజలు చివరకు బందిపోటు దొంగలు కిరాయి సైనికులు మౌలికమైన మార్పును సాధించారు. విప్లవ విజయం తర్వాత భిక్షకవృత్తి, వేశ్యావృత్తి, నిరుద్యోగం నిరక్షరాస్యత, వెనుకబడినతనం, అజ్ఞానం, స్త్రీకి సంబంధించిన దురభిప్రాయాలు, దేవుడు మతం వగైరా సాంఘిక వికారాల్ని వారు దిగ్విజయంగా నిర్మూలించగలిగారు. తరణం విప్లవకాలంలోవారికి ఆ యా సాంఘిక దురాచారాలకు సంబంధించి, ప్రకృతి పరిజ్ఞానం గురించి సామాజిక దశల గురించి, పోరాటక్రమంలో భాగంగానే వారికి శాస్త్రీయదృక్పధం ఏర్పడింది.

అలాగే తెలంగాణలో (1946-51) జరిగిన రైతాంగ పోరాట కాలంలో, కులమత, ప్రాంత, భాష విభేదాల కతీతంగా పెళ్ళిళ్ళు జరిగాయి. కట్నకానుకలు లేవు. పోరాడే దీక్షేవారికి గీటురాయి. ఒకపోరాటం అన్ని అరిష్టాల్ని కడిగేస్తుంది. ఒక జడివాన ఒక మహాప్రవాహం చెత్తా చెదారాన్ని ఊడ్చిపారేసినట్లుగా కొట్టుకొస్తుందే అదేవిధంగా సాంఘికమైనతరాల

వికారాల్ని ఒక విప్లవం పునాదులగుండాకదుల్చుకొని వస్తుంది. సమాజం నుండి వేరుపడిన సామాజిక వికృతమైన జీవితాన్ని తిరిగి సమాజంలోకి తెచ్చి రెంటినీ పరిష్కరిస్తుంది. సమాజానికీ జీవితానికీ వైరుధ్యం తొలిగి సమన్వయం కుదురుతుంది. జీవితం సామాజిక సంస్కారంగా అభివృద్ధి చెందుతుంది.

సమాజాన్ని సమూలంగా మార్చే విప్లవపోరాట క్రమంలో అంతర్భాగంగానే సాంస్కృతిక విప్లవం మొదట భావ విప్లవంగా ప్రచారం కావాలి. రాజకీయ విప్లవానికి అనుబంధంగా సాంఘిక విప్లవం రూపొందించబడాలి. స్వార్థపరులు తెచ్చే సాంస్కృతిక, రాజకీయ విప్లవాల పరస్పర వైరుధ్యాన్ని వర్గపోరాటాల ద్వారా విచ్ఛిన్నం చేయాలి. మన వ్యవస్థని ప్రజాస్వామ్యం అంటున్నా ఇది ధన స్వామ్యానికి పర్యాయ పదంగా వుంది. ఇది ప్రజల ప్రజాస్వామ్యం కాదు. పాలక వర్గాల ఇష్టారాజ్యం. ఇది బ్రూట్ మెజారిటీ కంచు కోట.

దీన్ని ప్రజల ప్రజాస్వామ్యంగా మార్చాలి. అనగా జనతా ప్రజాతంత్ర విప్లవంగా మారాలి. దీనికి ఏది ప్రాణం? 'భూమి' ప్రజలది కావాలి. అనగా భూమిలేని పేద రైతాంగం భూమి కోసం పోరాడాలి. నేటి భూసంస్కరణల కొల్లతనాన్ని చాటాలి. శ్రామిక వర్గ నాయకత్వంలో అభివృద్ధి చెందే ఈ పోరాటంలోకి వివిధ రంగాల ప్రజల్ని సమీకరించే నిర్మాణానికి, తద్వారా సంఘటిత శక్తికి ప్రాధాన్యతనిస్తూ, సాంస్కృతిక విప్లవం తొలిదశయైన భావ విప్లవాన్ని ప్రచారం చేయాలి. ప్రజల్ని దూరంచేసే ఎలాంటి వికృత చేష్టలకు, వింత పోకడలకు, నెగటివ్ ధోరణులకు అతిమత వాదాలకు తావీయకుండా నిరంతరం ఇంటా బయటా ఐక్యత కోసం అవగాహన స్మృతికోసం పోరాడాలి. స్త్రీ గురించి, మతం గురించి, దేవుడు కులం వగైరా అన్నది పాత నమ్మకాలకు వ్యతిరేకంగా శాస్త్రీయ దృక్పథం ప్రజలకు సంక్రమించేట్లు సిద్ధాంత ప్రచారం చేయాలి. సారస్వత కళారూపాల్ని వినియోగించుకోవాలి. ప్రకృతి పరిణామాల గురించి మూఢ నమ్మకాల్ని పోగొట్టాలి. కాని ఇవే మన మొదటి కార్యక్రమం కాజాలవు. మన

కార్యక్రమం భూమి ప్రజలకు దక్కేలా పోరాడడం. అంతిమంగా రాజ్యాధికారం ప్రజలకు సంక్రమించేలా పోరాడడం. ఇలా పోరాడేవారు క్రమంగా మారుతారు. ఈ పోరాటానికి తోడ్పడేవారు కూడా మారకతప్పదు. ఈ పోరాటపు వెలుగులో అందరూ ప్రభావితులవుతారు. కాకుంటే శత్రుపక్షంలో చేరిన స్వార్థపరులు తుడిచిపెట్టుకపోతారు.

సమారశీలంగా అభివృద్ధి చెందుతున్న సమాజంగా, సామాజిక అవసరంగా సంఘంలో కొత్త జీవిత విధానం ఉనికిలోకి వస్తుంది. దాని కనుగుణంగానే సాంఘిక జీవితం నిర్ణయింప బడుతుంది. పోరాటం స్తబ్ధం అయినప్పటికీ సంక్షోభాన్ని మనం ఎదుర్కొంటున్నాం. దీన్ని కూడా అధిగమించడానికి పోరాటావసరాన్ని ప్రచారం చేయాలి.

సమాజాన్ని మార్చడంలో సాంస్కృతిక విప్లవం నిర్వహించే పాత్ర వైతాళికుని పాత్ర అది సామాజిక దశలకు పోరాటాల దశలకు అనుగుణంగా అభివృద్ధిచెందే సూత్రధారుని నాంది.

# ప్రజా సాధనాలుగా కథ - నవల

**- అల్లం రాజయ్య**

---

కొన్ని వందల సంవత్సరాలుగా సర్వ సంపదలు కాలుమీద కాలేసుకుని దోచేసి ప్రజలను ఆకలికి, దరిద్రానికి గురిచేసిన వర్గానికి సర్వసంపదల సృష్టికర్తైన ప్రజలకు జరుగుతున్న సంకుల సమరం పదనెక్కుతున్న సమయంలో సాహిత్యం కళలు ప్రజల పరం చేసే పనిలోని భాగంగా సాహిత్యాన్ని విశ్లేషించవలసిన అవసరం కన్పిస్తున్నది........ నిజానికి ఈ వర్గ

పోరాటం ఇప్పుడిప్పుడే హఠాత్తుగా ఆకాశం నుంచి ఊడిపడ్డదికాదు. "మానవ చరిత్రంటే వర్గపోరాటాల" చరిత్రగా మార్క్స్ అభివర్ణించాడు. దోపిడి పుట్టుకే వర్గపోరాటానికి నాంది........మానవుల చైతన్యవంతమైన శ్రమ మూలకంగా, పోరాటమూలకంగా సమాజం అభివృద్ధి చెందుతోంది. కాని ఎప్పటికప్పుడు పోరాట ఫలితాలను ఎగిరేసుకపోయే వర్గం తలెత్తు తుంది. ప్రజలు మళ్ళీ పోరాడుతున్నారు.

నక్సల్బరిలో లేచిన రైతాంగపోరాటం నేరుగా ఈ దేశంలోని భూస్వామ్య వర్గాలకు గురిబెట్టబడింది. నక్సల్బరీనుండి శ్రీకాకుళం అటు నుండి నేటి ఆదిలాబాధు - కరీంనగర్ రైతాంగ పోరాటం కొనసాగబడు తోంది. ప్రజలు తమ గొప్పదైన, విలువైన రక్తతర్పణంతో ఈ పోరా టాన్ని కొనసాగించి సమస్త సంపదలను విముక్తం చేసి సమాజపరం చేస్తారు. ఈనాడు భారతదేశమే కాదు ప్రపంచమే వర్గపోరాటంతో బద్దలు కానున్న అగ్ని పర్వతంలాగున్నది.

ఈ సంక్షోభ. కల్లోల సమయంలా ప్రజా పోరాటాలనే పద్యంలో అంతవరకు దోపిడీదార్ల కబంధ హస్తాల్లో నలిగిన కళలు- సాహిత్యం విముక్తమై భావంలో, రూపంలో, భాషలో ప్రజల మంచి ప్రజలకోసం అనే సూత్రంతో తమ నిజమైన మార్గాన్ని వెతుక్కుంటున్నాయి. సాహి త్యం, కళలు, పొలాల్లోకి, కొండకోనల్లోకి, కార్ఖానాల్లోకి, మారుమూల గుడిసె చూర్లకిందికి చొచ్చుకుని పోవల్సిన అవసరం ఇంకా పరిపూర్తి కానే లేదు. ఈ పని విప్లవమంత సుదీర్ఘమైంది. కష్టసాధ్యమైంది కూడా....ఆక్ర మం ఎప్పుడో మొదలయ్యిందికూడా....

మనదేశంలో "సాహిత్యం-కళలు" ప్రజల పరం ఏ విధంగా అయి నాయో సమగ్రంగా పరిశీలించేటంత శక్తి నాకు చాలదు. ఇతర రాష్ట్రాల్లో ఇతర బాషల్లో జరిగిన మార్పుల సంగతటుంచి, తెలంగాణా సాయుధ పోరాటంలో నాట్ల దగ్గర, కోతలదగ్గర చీకటిరాత్రుల్లో కళాకారులు ఏయేయే కళా రూపాలద్వారా కళలను- సాహిత్యాన్ని జన సామాన్యంలోకి తీసుకవెళ్ళగలిగారో విశ్లేషించవలసిన అవసరం చాలా ఉన్నది.

నక్సల్బరీ పోరాటం బద్దలైన సమయంలో భారతదేశ రాజకీయాల్లో గొప్ప సంచలనం లాగే కళ-సాహిత్యాల్లో కూడా గొప్ప మార్పు పొడసూపింది....విప్లవరచయితల సంఘం -"ఆర్టు లవ్వర్సు" సొసైటీ జన నాట్యమండలిగా రూపు దిద్దుకోవడం ఈ దశాబ్ది సాహిత్య విప్లవ చరిత్ర తెలుపుతోంది.

అన్ని సాహిత్య ప్రక్రియల్లాగే కథ-నవల తమ గుణాన్ని, రూపాన్ని ప్రజల పోరాటానికనుగుణంగా మార్చుకున్నాయి. సంక్షిప్తంగానైనా ప్రపంచ విప్లవపోరాటాలు, కథ-నవల తీరుతెన్నులు మన దేశంలో మన తెలుగు సాహిత్యంలో వీటి ప్రభావం మొదలగు అంశాలను మనం గమనించాల్సి వుంటుంది.

కథలు-నవలలు వర్గసమాజంలో రెండురకాలు....

## 1. దోపిడి అనుకూల కథలు-నవలలు :

ఇలాంటి కథలు, నవలలు ఇప్పటి వ్యాపార పత్రికల్లో పెద్ద సంఖ్యలో ప్రచురింపబడుతున్నాయి. ఈ సాహిత్య ప్రక్రియను వాడుకున్నట్టుగా దోపిడిదార్లు మరే సాహిత్య ప్రక్రియను వాడుకోవడంలేదు.... భూస్వామ్య భూర్జువా, భూస్వామ్య భూర్జువా సంకర, పలాయనవాద, రివిజనిస్టు ఇట్లాగా ప్రజాపోరాటాలు ఉధృతమౌతున్నకొద్ది, పెల్లుబుకుతున్న ప్రజా చైతన్యాన్ని పక్కదారి పట్టించడానికి కథలు-నవలలు అనేక రూపాంతరాలు చెందాయి....రూపాలెన్ని మార్చుకున్నా వీటి ప్రధాన లక్ష్యం తరతరాల దోపిడీని ఏదో ఒక విధంగా యథాతథంగా ఉంచడమే.... ఇవి గుణంలో, రూపంలో, భాషలో ప్రజా వ్యతిరేకతను కలిగి ఉంటాయి.

## 2. ప్రజా కథలు - నవలలు :

ఇలాంటి సాహిత్యం ప్రజాపోరాట అవసరం నుండి పుట్టుకొచ్చింది....గుణంలో, రూపంలో, భాషలో ఇవి జన సామాన్యంలోకి

వెళ్ళేటివి. ఇవి వినే కథలు, చదువుకునే కథలు అని రెండు రకాలుగా ఉంటాయి.

జనం బంటాలు తీసేకాడ, బాయిలు తవ్వేకాడ, పొలాలు దున్నే కాడ, పంట కుప్పలముందు, పంచాయతుల దగ్గర, సభల్లో, వెన్నెల రాత్రుల్లు....ఎప్పుడేమిటి? ఎక్కడేమిటి? జనం ప్రతి ఇద్దరు కలిసినచోట తప్పక కథ చెప్పుకోబడుతుంది.... నీతులు చెప్పడానికి, కష్టసుఖం చెప్పు కోవడానికి, తన అనుభవం చెప్పడానికి కథను బలమైన ఆయుధంగా జనం వాడుకుంటారు. ఒక ఊళ్ళో జరిగిన ప్రజాపోరాటం మరొక ఊరికి గాలికన్న వేగంగా ఈ కథలద్వారానే చేరుతుంది.

మానవుడు వేటమీద జీవించే కాలంలో వేటలో తను పొందిన అనుభవం – తోటి మానవుడికి చెప్పడంలోనే తొలికథ ఊపిరిపోసుకున్నది. (నియాండర్తల్ మానవుడు గీసినవని చెప్పబడుతున్న రెండు వేట దృశ్యాలు రెండు కథలే) అప్పటినుండి సమాజంలో సంభవించిన ప్రతి మార్పు చేర్పు ఎదుటి మానవుడితో పంచుకోవడంలో కథ పదునెక్కింది. కథలు చెప్పే ఆచారం ఒక తరంనుండి ఇంకో తరానికి వారసత్వంగా వచ్చేది....కొత్తతరం తమ సమకాలీన సాంఘీక, రాజకీయ, ఆర్థిక విష యాలను పాతకథల్లో చొప్పించేది. నేటికి పల్లెలో ముసలివాళ్ళు అనేక కథలు చెప్పడం, కులాల పుట్టుకల గురించి కుల గురువులు, జాతుల గురించి ప్రచారంలో ఉన్న కథలు– యితర జానపద కళాకారులైన, పాండ వలోరు, పిచ్చకుంట్లోల్లు, చిందోల్లు, మాల్లోల్లు, గోత్రాలోల్లు, దెక్క డోల్లు, ఒగ్గోల్లు, సారధికాళ్ళు, తదితరులు చెప్పే అనేక కథలు ఉదాహర ణలు....

సమాజం మారుతున్నాకొద్దీ ఈ కథలు మారుతూ ఉంటాయనడానికి తెలంగాణాలో ప్రచారంలో ఉన్న ఒక కథ తీసుకుందాం....

ముగ్గురు మూర్ఖుల కథ... ఈ కథ 1974కు పూర్వం ఈ విధంగా చెప్పబడేది....గోకుడు గోపయ్య, కండ్లబూసుల కనకయ్య, చీమిడి

చిన్నయ్య? పోలీసు పటేల్, పట్వారి, మాలిపటేల్ వరుసగా....వీళ్ళ ముగ్గురు తాము గొప్పవాళ్ళమంటే తాము గొప్పవాళ్ళమని తరుచూ వాదులాడుకునేవారు.... ఉదాహరణకు, కామ, క్రోద మదమాత్సర్యాలు మనిషిని అనేక తప్పులు చేయడానికి పురికొల్పుతాయి....కాని ఈ గోకుడుగలవారు ఎల్లప్పుడు గోకుడు తన్మయత్వంలో ఉండి పై వాటి అన్నిటికి దూరంగా సజ్జనుడుగా ఉంటాడు. ఆ లెక్కన తనుఊళ్ళో అందరికంటే గొప్పవాన్నని గోపయ్య వాదించేవాడు. ఇట్లాగా మిగతా ఇద్దరు కూడా తమ అవలక్షణాలకు గొప్పతనాన్ని ఆపాదించుకునేవారు.... ఈ సంగతి తేలక ఒకనాడు గ్రామస్థులందరిని చావడీదగ్గరకు పిలిచారు....ఎవరు గొప్ప? అన్న విషయం తేల్చుకోవల్సి ఉన్నది....

ఒకనాడు ముసలివాడు చివరన వాళ్ళ ముగ్గురికి పోటీ ఏర్పాటు చేస్తాడు. గోపయ్య గోకకుండా, కనకయ్య దోమలు తోలుకోకుండ చిన్నయ్య చీమిడి తీయకుండా ఎవరెక్కువసేపుంటే వారే గెలిచినట్టు అంటాడు. అర్ధగంట వరకు ముగ్గురి పరిస్థితి భయంకరంగా తయారవుతుంది. గోపయ్య తనతాత వేటసీను వర్ణించి రెండు దుప్పులు కొమ్ములతో ఏవిధంగా కొట్లాడినాయో అభినయిస్తూ రెండు చేతులు ఒకదానికొకటి వేళ్ళతో ఇరికించుకొని నలుపుకుంటాడు....అటునుంచి ఇటు, ఇటునుంచి అటు దుప్పులు ఇట్లా పరుగెత్తి ఉంటాయని కనకయ్య కుడిచెయ్యి ముఖం మీద ఆడంచుకుంటాడు. అట్లా కొట్లాడుతుండగా "హాచ్చర్య" పడకుండా ఎట్లా ఉండగలిగారని? చిన్నయ్య తుమ్ముతాడు. ఇట్లా వినేవాళ్ళకు కడుపుబ్బ నవ్వించేటందుకు చెప్పుకునేవారు.

గ్రామాల్లో భూపోరాటం మొదలైన పదనెక్కుతున్న దశలో ఈ కథలో భూమిసమస్య కేంద్రంగా చెప్పడం జరుగుతోంది. వాళ్ళు పోటీ పడ్డది "షికం" (చెరువులో తట్టుభూమి) కోసంగా.... ముగ్గురు జిత్తులమారి వాళ్ళే కనుక- ఆ పోటీలో ముగ్గురు ఓడిపోయారు కనుక భూమి ఊరి ప్రజానీకానికి చెందుతుందని చివరన ఆ ముసలతను చెప్పడం- జనం భూమి స్వాధీనం చేసుకోవడంతో కథ ముగుస్తుంది....

ఇక చదువుకునే కథల విషయానికొస్తే.... కథ-నవల పుట్టుక మార్పుక్రమాన్ని పరిశీలించాలి....

భారతదేశంలో ఫ్యూడల్ ఉత్పత్తి శక్తులకు, ఇంగ్లీషువాడు ప్రవేశ పెట్టిన పెట్టుబడిదారి ఉత్పత్తిశక్తులకు సంఘర్షణ తీవ్రమైన దశలో సంస్కరణవాదం తలెత్తింది. ఈ సంస్కరణ వాదాన్ని ప్రచారం చేయడంకోసం జాతీయ బూర్జువా వర్గం కథ నవలను అభివృద్ధిచేయడం కనిపిస్తుంది. కందుకూరి వీరేశలింగం పంతులు గారి "రాజశేఖర చరిత్రము" లాంటి నవలలు అదే కాలంలో వచ్చాయి. ఫ్యూడల్ భావాలను ఎద్దేవ చేస్తూ రానూ రానూ అనేకమంది కథలు రాశారు. కిరణకుమారులాంటి వారి కథలను అందు కుదాహరణగా చెప్పుకోవచ్చు.

ఫ్రాన్సులో జరిగిన ఫ్రెంచి బూర్జువా విప్లవం ఫ్రెంచి సాహిత్యంలో అప్పటివరకున్న మందకొండితనాన్ని బద్దలుకొట్టింది. అలాంటి సమయంలో విక్టర్ హ్యూగోలాంటి రచయితలు పుంఖాను, పుంఖంగా కథలు నవలలు రాశారు. ఈ విప్లవ ప్రభావం ప్రపంచ సాహిత్యంలో చదువుకునే కథ నవలకు ఒక స్పష్టమైన గుణాన్ని. రూపాన్ని నిర్దేశించింది. ఆ ప్రభావం "చలం" లాంటి తెలుగు రచయితల మీద బాగా పనిచేసింది.

రష్యా అక్టోబరు విప్లవం ప్రపంచ విప్లవ సాహిత్యంలోనే కాదు కథ-నవలల్లో కూడా భౌతికవాద దృక్పధాన్ని ప్రవేశ పెట్టింది. వర్గపోరాటాన్ని వివిధ కోణాల్లో నుంచి ప్రదర్శనం చేసింది. చెప్పుకున్న కథలనట్లా ఒదిలేస్తే లిఖితరూపంలో ఈ కాలంలో వెలువడ్డ కథలు-నవలలు అసంఖ్యాకములు.

చెఖోయ్‌వ్‌లాటి రచయితలు పెట్టుబడి దారి సమాజంలోని మానవ విలువలను ఎద్దేవ చేస్తూ అనేక కథలు రాశారు. మాక్సింగోర్కీ విప్లవ అవసరం మీద విప్లవంలో జరిగిన ఘటనా ఘటనల గురించి విశ్లేషించాడు- పోరాటంలో కార్మికవర్గం యొక్క చైతన్యవంతమైన పాత్రను చిత్రించి ప్రపంచ విప్లవ సాహిత్యానికి ప్రజానీకానికి దోహదం చేసే అనేక కథలు నవలలు రాశాడు. "అమ్మ" నవల దేగపక్షి లాటి కథలు ప్రపంచ విప్లవ సాహిత్యానికి అతడిచ్చిన గొప్ప కానుకలు.

విప్లవశ్రేణుల్లో నుంచి రచతలు, రచనలు విస్తృతంగా వచ్చాయి. రష్యా విప్లవంలో రైతాంగం యొక్క కదలికను "బీళ్ళు దున్నేరు" లాటి నవలలు అద్దం పట్టాయి.

అక్టోబరు విప్లవ ప్రభావంతో మన దేశంలో కిషన్ చందర్ లాటి రచయితలు కథలు రాశారు. కాశ్మీరు రైతాంగ తిరుగుబాటు దేశంలో ఇంగ్లీషువాడి వలసాధిపత్యం క్రింత పతనమైన ఫ్యూడల్ శక్తులు వస్తువుగా అతను తొలి రచనలు చేశాడు....

ఒక పక్క వలసాధిపతులైన ఇంగ్లీషువాళ్ళకు వ్యతిరేకంగా భారత దేశంలో తలెత్తిన జాతీయ పోరాటం....వీటన్నిటితో ప్రభావితమై ప్రేమ్ చంద్ లాంటి రచయితలు అసంఖ్యాక కథలు నవలలు వెలువరించారు.... అటు అక్టోబరు విప్లవ ప్రభావం ఇటు జాతీయ పోరాట ప్రభావం ప్రేమ్ చంద్ రచనల్లో కనిపిస్తుంది. గ్రామీణ ఉత్పత్తి సంబంధాలను, ఉత్పత్తి శక్తులమధ్య సంఘర్షణను ప్రేమ్‌చంద్‌లాగా చిత్రించిన భారతీయ రచయిత మరొకడు లేడు. గ్రామంమీద తన గావుపట్టు గలిగిన పట్వారి, పటేండ్ల, షావుకార్ల దోపిడి, భూమికోసం, భుక్తికోసం రైతాంగం పడే బాధలు కొత్తగా భారతీయ సమాజంలో అడుగుపెట్టిన డబ్బు సంస్కృతి (మహాజని సంస్కృతి) ని ఎత్తి చూపుతూ గోదాన్, కర్మభూమిలాంటి నవలలు, సవా సేరు గోధుమలు, కఫన్‌లాంటి కథలు అదే కాలంలో ప్రేమ్‌చంద్ కలం నుండి వెలువడినవి.

భారత జాతియ పోరాటం కథావస్తువుగా శరత్ బంకించంద్ కొన్ని నవలలు రాశాడు. భారతి, ఆనంద మఠం లాంటి నవలు అందు కుదాహరణలు.

తెలుగులో ఈ రెండు పోరాటాలు (అక్టోబరు విప్లవం, జాతీయ పోరాటము) ప్రభావాన వెలువడిన నవల మాలపల్లి, కొల్లాయి గట్టితేనేమి? (మహీధర రామమోహనరాయ్) లాంటి నవల వచ్చాయి ...

రాను రాను భౌతికవాద దృక్పథం రచయితల్లో బలపడడం కనిపి

స్తుంది. కొడవటిగంటి కుటుంబరావుగారు చదువు, అనుభవం లాంటి రచనలు అకాలంలోనే, ఆ పరిణామ క్రమంలోనే వచ్చాయి.

చైనా రైతాంగ విప్లవం కథ-నవలను మరింత పరిపుష్టం చేసింది. పాత చైనా భావాలను అపహాస్యం చేస్తూ, కొత్త ఉత్పత్తి శక్తుల కదిలికలను చిత్రిస్తూ లూసున్‌లాంటి రచయితలు కథలు రాశారు. మేధావి, మూర్ఖుడు, బానిసలాంటి కథలు చెప్పుకోతగినవి.

చైనా విప్లవ సాహిత్యానికి ఒక విలక్షణ గుణం ఉన్నది. విప్లవ కాలంలో వచ్చిన చైనా సాహిత్యం వినడానికి పనికివచ్చేది. అట్లాగని లిఖితరూపంలో సాహిత్యం అభివృద్ధి కాలేదనికాదు- దీనికి ప్రధానకారణం చైనా విప్లవంలో ప్రధానచోదకశక్తి రైతాంగం. గ్రామాల్లో ఈరైతాంగం అక్షరం ముఖం ఎరగకుండా వేల సంవత్సరాలు ఉంచబడ్డారు. భూస్వామికి శిస్తు కట్టిన ధాన్యం లెక్కపెట్టుకోవాలంటే కర్రముక్కల సహాయం కోరవలసినంత అజ్ఞానంలో ఉంచబడ్డారు ...ఇలాంటి నిరక్షరాస్యులైన రైతాంగం తమ బతుకుల గురించి కథలల్లుకున్నారు. పాటలు పాడుకున్నారు. ఆ కథలను, పాటలను ప్రజలనుంచి తీసుకొని విప్లవీకరించి మళ్ళీ ప్రజలకందించారు పోరాట సాహిత్యకారులు. దీనికి గొప్ప ఉదాహరణ "తెల్ల కురుల అమ్మాయి" అనే రూపకాన్ని చెప్పుకోవచ్చు.

మానవులను దయ్యాలుగా మార్చి మానవులమధ్యనుంచి అంధవికారంలోకి తరిమిన పాత భూసామ్య వ్యవస్థస్థానే దయ్యాలను మానవులుగా చేసి వెలుగులోకి తేవడం విప్లవం లేవడం ఇందులోనికథ.... ఇది అదివరకే ప్రచారంలో ఉన్నకథ.... దీన్ని అనేకవందలసార్లు జనం సూచనల మేరకు విప్లవీకరించి పదునైన సాంస్కృతిక ఆయుధంగా కళాకారులు మలుచుకున్నారు.

రైతాంగ విప్లవక్రమాన్ని కొడుకులు కూతుళ్ళు "భూసంస్కరణల అమలుగురించి" ఉప్పెన "విముక్తి" అన్న నవలలు, విప్లవంలో తలెత్తిన అనేక సమస్యలు పరిష్కరింపబడిన విధానాన్ని తెలుపుతూ, "బుగతగాడి

మాంసం" "ఖరీదుకట్టే షరాబులేడోయి" "పొలిటికల్ కమిస్సార్" లాంటి అనేక కథలు వచ్చాయి.

మావో చరిత్రాత్మకమైన "యేనాన్ రిపోర్టు" అనేక కథలతో నిండినవున్నది.... మావో తీసుకున్న ఒక ప్రచారంలో ఉన్నకథ "రైతాంగస్త్రీ- భూస్వామి మంచం" ఒక గ్రామంలో జనం భూస్వామిగాడిని ముట్టడి చేసినప్పుడు భూస్వామి పడకగదిలో అతిసుందరమైన మెత్తని మంచాన్ని చూస్తుంది.... ఆస్త్రీ ఆ మంచంమీదకూర్చుండి సంతోషపడుతుంది. మరో నిముషంలోనే భూస్వామి ఆ మంచంకోసం కొల్లగొట్టబడ్డ తమ సంపదలు అ మంచం చరిత్ర గుర్తొచ్చి ఒళ్ళు గగుర్పొడిచి కిందదుమికి మంచంవేపు అసహ్యంగా, క్రోధంగా చూస్తుంది....

మనదేశంలో కథ- నవల ప్రజాపోరాట స్వభావాన్ని సంతరించుకున్నది తెలంగాణా సాయుధపోరాటం ప్రభావంతోనే- ఈ పోరాటం ప్రత్యక్షంగా చూసి కిషన్‌చందర్ లాంటి రచయితలు "పొలాలు మేల్కొన్నాయి" లాంటి నవలలు రాశారు. తెలంగాణాలో ఈ రైతాంగపోరాటం క్రమాన్ని వట్టికోట అళ్వారుస్వామి వస్తువులో, రూపంలో, భాషలో ప్రజా స్వభాం కలిగినట్టి ప్రజల మనిషి, గంగులాంటి నవలలు రాశాడు.... దాశరధి రంగాచార్య "మోదుగుపూలు" లాంటి నవలలు ఆ పోరాటాన్ని, దేశ్‌ముఖ్‌లు, రెడ్డిదొరలు, తురకజాగీర్దాలు క్రూరత్వాన్ని ప్రస్ఫుటం చేస్తాయి. ఈ పోరాటం ప్రభావంతో మాగోఖలేలాటి రచయితలు కొన్ని కథలు రాశారు.... పోరాటం ఆగిపోవడంతోటే పోరాట సాహిత్యం వర్గ సంకర సాహిత్యంగా దిగజారిపోయింది. "జనపదం"లాటి నవలలు రాయబడ్డాయి.

మళ్ళీ నక్సల్బరి పోరాటం బద్దలుకావడంతో సాహిత్యంలో సంచలనం బయలుదేరింది.... శ్రీకాకుళపోరాటంలో గిరిజనులు చెప్పుకున్న కథలు వినే కథలైతే- భూషణం "అడివంటుకున్నది" కథలు చదువుకునే కథలు.

కొడవటిగంటి మొదలైన శాస్త్రీయ దృక్పధం కథలు. నవల్లో

రాచకొండ విశ్వనాధశాస్త్రి, కాళీపట్నం రామారావుగారు కొనసాగిస్తూ వచ్చారు. శ్రీకాకుళ పోరాటం వీరిద్దరి రచనలను మరింత పదనెక్కించింది. "పిపీలికం" నుండి "సొమ్ములుపోనాయండి" కా కథలు "గోవులొస్తున్నాయి జాగ్రత్త" మొదలు రాజు మహిషి" దాకా నవలలు రావిశాస్త్రి నుండి వస్తే "యజ్ఞం" నుంచి "కుట్ర" దాకా కాళీపట్నం రామారావు కథలొచ్చాయి. శ్రీకాకుళ పోరాటాన్ని చిత్రించిన భూషణం "కొండగాలి" నవల పోరాట ఫలితంగా వచ్చిందే....

సరిగ్గా ఈ పోరాట ప్రభావం తెలుగు రచయితల మీద పెద్ద ముద్ర వేసింది... ఎలాంటి పుచ్చు కథ రాసినా చివరకు భూస్వామినో, మరొక దోపిడిదారునో హత్య చేయించకుండా చాలమంది రచయితలు రాయకుండా ఉండడం నామోషిగా భావించే స్థితి వచ్చింది.

ప్రజా పోరాటాలు అనేక కష్టనష్టాలతో, అనేకమంది విప్లవకారుల ఆత్మార్పణంతో ఎరుపెక్కుతున్న దశలో వర్గ శత్రు నిర్మూలనా ఏకైక మార్గంగా పోరాటంలో ముందుకు వచ్చిన చారిత్రిక దశలో తక్షణావసరాల మీద కదిలించడం, బలమైన ప్రజాపునాదిని నిర్మించడం ఆవశ్యకతను ముందుకు తెచ్చే ఉద్దేశ్యంతో "చైతన్యం" అన్న కథ వచ్చింది....

ఎమర్జెన్సీ ఎత్తివేయబడిన తరువాత ప్రజాపోరాటాలు ఉదృతం కావడం, అందుకు బలమైన కేంద్రంగా గోదావరి తీర జిల్లాలైన ఆదిలాబాదు కరీంనగర్ రైతాంగం దొరలకు వ్యరేకంగా రైతుకూలి సంఘాలు పెట్టడం, తద్వారా గ్రామం మీద దొరలు వాళ్ళతొత్తులు కలిగిఉన్న ఆర్థిక, రాజకీయ సాంఘీక అధికారాలను బద్దలు కొట్టి బలమైన ప్రజా అధికారం స్థాపించే క్రమంలో చాలా కథలు వచ్చాయి. సంఘాల నిర్మాణం, సంఘంలో క్రియాశీల పాత్ర వహించే వర్గాలు, స్థూలంగా సంఘం యొక్క మౌళిక స్వరూపాన్ని, మిగతా పోరాట ప్రాంతాలకు, మిగతా సంఘాలకు విస్తరించే లక్షనంతో "సంఘం" అన్న కథ వచ్చింది. ఇదే క్రమంలో భూమికోసం, భుక్తికోసం ప్రజలు చేసిన పోరాటాన్ని చిత్రిస్తూ "కొలిమంటుకున్నది" నవల వచ్చింది. సంఘాల నిర్మాణం, అందులో పాత్ర వహించే, అగ్ర

భాగాన నిలిచే శక్తుల గురించి, నిర్మాణంలో ఎదురయిన అనేక సమస్యల గురించి "ఊరేగింపు" నవల రాయడం జరిగింది. (అదింకా ముద్రింపబడలేదు.)

గ్రామంలో భూస్వామి ధనికరైతు, మధ్య తరగతి రైతు రైతుకూలి, ఇతర వృత్తుల వాళ్లు వాళ్లీ మధ్య సంబంధాలను శాస్త్రీయంగా పోరాటానికి ఉపయోగించుకున్న "రైతు ఆయాశక్తుల మధ్య వైరుధ్యాన్ని కూలి సంఘం" యొక్క విజయ రహస్యాన్ని "ఎత్తుండ్లి పిడికిళ్లు" అన్న కథ తెలుపుతుంది.

సంఘాలు బలపడి కంచు కోటలై, దొరల అన్ని అధికారాలను తాత్కాలికంగా రద్దుచేసి దొరలను గ్రామంనుంచి బహిష్కరించిన తరునంలో, దొరలు, వాళ్ళ తరుపున ప్రభుత్వం ప్రజల మీద దాడిచేసి, గ్రామల్లో భీభత్సం సృష్టించి, సర్వసందలను, పొలాలను సర్వనాశనం చేసి పైగా ప్రజలను హింసాకారులుగా దౌర్జన్యకారులుగా, దొంగలుగా ఉల్టా ప్రచారం చేస్తున్న దశలో హింస గురించిన శాస్త్రీయ అవగాహనను పెంచడానికి, పాలకవర్గాలు, దొరలు తమ దోపిడిలో అమలుపరుస్తున్న క్రూర హింసను బట్టబయలు చేస్తే, "ప్రజాయుద్ధం హింసనాపడానికి జరిగే అనివార్య యుద్ధం" అన్న సత్యాన్ని తెలుపడానికి "సృష్టి కర్తలు" అన్నా కథ వచ్చింది.

ఇట్లా ప్రజాపోరాటంలో తన చారిత్రిక తక్షణ కర్తవ్యాన్ని నిర్వహించడానికి రచయితలు పోరాట సాహిత్యం రాశారు.... పోరాటం నుండి మళ్లీపోరాటానికి కథలు నవలలు వచ్చాయి.

అయితే ఈకథలు ఒకరిద్దరు రచయితలనుండి కాక ఎక్కువ మంది రచయితలనుండి ఇంకా రావల్సి ఉన్నది... ఈ రెండు జిల్లాలో గణనీయమైన పోరాటాలు చేసిన గనికార్మికులనుండి, ఫాక్టరీ కార్మికుల గురించి కథలు ఎక్కువ రాలేదు...."రాజీ" లాటి ఒకటి రెండు కథలు తప్పిస్తే అసలు రానేలేదు....ఈ కృషి ఇంకా జరుగాల్సి ఉన్నది....

ప్రజాపోరాట సాధనాలుగా కథ, నవల అచిత రూపంలో వచ్చిన

వాటి గురించి చర్చించాము....అయితే ఇదే పోరాటంలో వచ్చిన చెప్పుకునే కథల గురించి కూడా మనం చర్చించాలి ... "మద్దునూరు జన్నెకోడె, భూమి, పని ఆర్గనైజేషన్" లాటి అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. ఇటీవల ప్రచారంలోకి వచ్చిన కథ. "రెండడుగులు వెనక్కు ఒక్కడుగు ముందుకు."

ఇద్దరు సంఘ కార్య కర్తలు నడుస్తున్నారు.... అందులో ఒకనికి పోరాటం నడిచే తీరు గురించి ఆందోళనగా ఉన్నది....చాలా గ్రామాల్లో పోలీసు క్యాంపులు వచ్చి సంఘాల బహిరంగ సభలాంటిది పెట్టుకోవడానికి వీలు లేకుండయిపోయింది....కొన్ని గ్రామాల్లో సంఘాలు తాత్కాలికంగా వెనకడుగు వేయవలసి వచ్చింది. మరికొన్ని కొత్త గ్రామాలకు విస్తరించ సాగారు. చాలా సేపటి నుండి ఇతగాడు రెండవతన్ని ప్రశ్నలతో వేధించ సాగాడు. రెండవతను కూడా రైతే. అతనికి ఎట్లా చెప్పాలో తోచలేదు. కాని అతనికి తీరు అర్థమైందే....ఇంతలో వాళ్ల కడ్డంగా చిన్న నీటి కాలువ అడ్డం వచ్చింది. ఇద్దరు దాటేశారు. రెండవవాడు మొదటివానికి అదిగుర్తు పెట్టుకొమ్మని చెప్పాడు....మరికొంచెం దూరం నడిచేసరికి ఈసారి సునాయాసంగా దాటరానంత పెద్ద నీటి కాలువ అడ్డం వచ్చింది....రెండవవాడు మొదటివాన్ని "రెండడుగులు వెనక్కేయి....బలాన్ని కూడదీసుకో గుప్పించి దునుకు" అన్నాడు.... కొంచెం దూరం నడిచిన తరువాత రెండవ వాడు "సంగతి అర్థమయ్యిందా?" అన్నాడు.... మొదటివాడు రెండవవాన్ని కావలించుకున్నాడు ...

ప్రజాపోరాటాలను నిజాయితీతో అధ్యయనం చేయకుండా తమ వైయక్తిక దృష్టికోణం నుండి రాసిన నవలలు కూడా కొన్ని వచ్చాయి.

అలాంటి కథలు నవలలు సాధారణంగా వ్యక్తిగత హింసను సమర్థించేవి. పోరాటం యొక్క మౌలిక స్వభావాన్ని దిశను అర్థంచేసుకోకుండా ఏదో ఒక కోణంలో చిత్రించినవి, సమిష్టి ప్రజాపోరాటాన్ని కాక వ్యక్తి చైతన్యాన్ని చిత్రించేవి, హైలైటు చేసేవి....

'మరీచిక' ఇంకా 'సూర్యుడుదయించలేదు' లాంటి నవలలు పోరాటము పట్ల సానుభూతి ఉండి ఏ మాత్రం అవగాహన లేకుండా రాసినవి. కాని ఇటీవల స్వాతిలో బహుమతి పొందిన నవల "తూరుపు ఎరుపులో మహిళ" లాటి నవలల గురించి జాగ్రత్తగా పరిశీలించాలి. ఈ నవల ఇద్దరు విప్లవకారులు, మరికొంత మంది స్త్రీల చుట్టు తిరుగుతుంది. ఈ విప్లవకారులు నకిలీ విప్లవకారులు ఎట్లాగో విప్లవం పట్ల ఏ కొద్ది అవగాహనున్నవారికైనా స్పష్టంగా తెలుస్తుంది. సంవత్సరాల తరబడి తొక్కుండబలి తాగుతూ, చెట్లల్లో, గుట్టల్లో జనం మధ్య అనేక కష్ట నష్టాలలు, త్యాగాలతో, దొరలు, వారిగుండాలు చావదెబ్బలు గొట్టి ఊరి బయట పారేసిన కొన ఊపిరితో తమ జనం మధ్యకు మళ్ళీ వెల్లిన విప్లవ కారులు, కడుపులో కత్తిదిగి కారిన నెత్తుర్లో విప్లవం రాసిన విప్లవకారులు నిజానికి సాదా సీదా మనుషులు. ఈ నవలలో విప్లవకారులు లాడ్జింగుల వెంట తిరుగుతూ స్త్రీలను ఉద్ధరిస్తున్నామనే పేరుతో దాళ్లతో గడిపే హీరోలు....

"వేలాడిన మందారం" కూడా ఇంచుమించు ఇలాంటి నవలే.

అయితే ప్రజలు తమకు పనికిరాని సాహిత్యాన్ని నిర్మొహమాటంగా త్యజిస్తారు.

క్లుప్తంగా పోరాట కథ నవల గురించి విశ్లేషించుకున్నాము. నిజానికి ఈ విశ్లేషణ సమగ్రమైంది కాదు.... నేను ఉదహరించిన ఒకటో రెండో కథలు ఈ పరిశీలనకు పూర్తి బలాన్ని చేకూర్చగలవని అనుకోవడంలేదు. పోరాట ప్రాంతాల్లో గ్రామ గ్రామానికి వందల కథలున్నాయి. రైతుకూలి సంఘాలు వందల వేల సమస్యల్ని పరిష్కరించాయి. అవి ఒక గ్రామం నుండి మరొక గ్రామానికి కథల రూపంలో ప్రచారమయ్యాయి. ఆయా గ్రామాల్లో పోరాటంలో తలెత్తిన సమస్యలకు మార్గదర్శకులయ్యాయి.... అక్షరరూపంలో బహుకొద్ది మాత్రమే వచ్చాయి. వచ్చిన వాటిలో పరిమిత వనరుల దృష్ట్యా కొద్దిమాత్రమే ప్రచురింపబడి మళ్ళీ జనంలోకి వెళ్లాయి. కాయిదం చూస్తే వనుకు పుట్టేజనం గుంపులు గుంపులుగా లిఖిత

రూపంలో ఉన్న కథలు చదివించుకొని విన్నారు. ఆలోచించారు, పిల్లలు, భూస్వాములుగా. షావుకార్లుగా వాళ్ల తొత్తులుగా నటించి వాళ్లను అపహాస్యంచేశారు. కొంతమంది తమ బతుకులను పుస్తకాల్లో చూసుకున్నారు.

అయితే కథ-నవల మరింత పదునెక్కి- బలమైన ప్రజాపోరాట ఆయుధంగా కావాల్సి ఉన్నది...కథ నవల ప్రజాపోరాటాలతో పాటు నడవడం మూలకంగానే ఇది సాధ్యం. నాలుగు గోడల మధ్య కూర్చుటండి ప్రజా కథల గురించి ఆలోచించలేం. రచయితలు జన సామాన్యంలోకి అంటే కార్మిక, రైతాంగంలోకి వెళ్ళాలి. అక్కడే ప్రజా పోరాట కథలు-నవలలు రూపొందేది. ప్రజా పోరాటాన్ని శాస్త్రీయంగా అధ్యయనం చేయ్యాలి. ప్రజలనుంచి వస్తువును, రూపాన్ని భాషను తీసుకొని విప్లవీకరించి మళ్లీ వాళ్ల కందించాలి.

అయ్యో అయ్యో కథలకు, వైయక్తిక పోరాట కథలకు కాలం చెల్లిపోయింది. వర్గపోరాటం ఒక పద్ధతిలో జరుగుతుంది; ఇందులో రెండు వర్గాలు తమతమ అస్తిత్వంకోసం తీవ్రంగా పెనుగులాడుతాయి. ఈ యుద్ధంలో ఇష్టమున్నా లేకున్నా ఆయా వర్గాలకు చెందిన మొత్తం శక్తులు కదులుతాయి.

ఇవ్వాల్ల భారతదేశం ప్రజా పోరాటలతో "కుమ్మరో" లాగా కుతకుతలాడుతోంది. ఇప్పటి ప్రజా పోరాటాల్లాగే పోరాట కథలు-నవలలు మొరటుగా ఉండవచ్చు, ప్రజలు తమ విముక్తి పోరాటంలో అన్ని నేర్చుకుంటారు. నెత్తురు చిందిస్తారు. తమ సర్వశక్తులను ధారపోస్తారు.... అంతిమ విజయం సాధిస్తారు. ప్రజా పోరాట సాధనాలుగా కథ-నవల కూడా పోరాటమంత దీర్ఘకాలం అభివృద్ధి చెందుతాయి.

రైతుబిడ్డలు- గనుల్లో చీకటి గుయ్యాలల్లో, ఫ్యాక్టరీలల్లో పని చేసే కార్మికులు అద్భుతమైన పోరాట కథలు-నవలలు వినిపిస్తారు, రాస్తారు....

: — :

# తెలుగు కవిత్వంలో ఆధునికత

-సోమసుందర్

ఇరవయ్యో శతాబ్దం హేతువాదాన్ని మకుటంగా ధరించింది. సర్వమేధా రంగాలకూ హేతువాదమే చోదకశక్తిగా మారింది. అటు వైజ్ఞానిక శాస్త్రంలో వలెనే ఇటు సాహిత్యంలో కూడ ప్రయోగవాదం ప్రబలతరం కాజొచ్చింది.

కళారంగాలన్నింటా ఆనుపూర్వికతకీ, గతానుగతికత్వానికి పెడమార్గం స్థిరపడనారంభించింది.

అంతమాత్రంలో ఈ శతాబ్దంలో వచ్చిన సాహిత్యమంతా హేతువాదాధీనమేనని చెప్పడానికి అవకాశం లేదు. అందువల్లనే ఈ శతాబ్దంలో సంభవించినంత మాత్రంలో సర్వకళా స్వరూపాలనూ, సర్వసాహితీ సంపదనూ అవిచక్షంగా ఆధునికమని విలువ కట్టడానికి అవకాశం లేదు.

ఆధునిక చైతన్యానికి నిర్దిష్టమైన నిర్వచనం రూపొందించుకోకపోతే ఆ పదం కేవలం కాలవాచిగానో, నవ్యపదానికి పర్యాయ పదంగానో మిగిలిపోతుంది. ఈ ఆధునిక స్వరూపాన్ని తీర్చిదిద్దిన చోదకశక్తులు ఉన్నాయి. వైజ్ఞానిక శాస్త్ర రంగాన్ని ఈ శతాబ్దారంభంనుంచీ ఆధునికం చేసిన మహర్షులు నలుగురు: జీవపరిణామాన్ని మొదటిసారి విపులీకరించిన చార్లెస్ డార్విన్. ఈయన ప్రతిపాదించిన సిద్ధాంతంవల్ల మానవుడొకానొక కళరాత్రి సృష్టించబడ్డాడని చిలవలూ పలవలూ కల్పించి ప్రచారం చేసిన

మత గ్రంథాల బండారం బయటపడింది. ఆర్థిక రాజకీయ సామాజిక శక్తుల అంతస్సంబంధంలోని గతి తార్కిక భౌతిక లక్షణాలను విశ్లేషించి సామాజిక విప్లవాన్ని నిర్దేశించిన కారల్ మార్క్సు ద్వితీయుడు. దీనితో ధన స్వామి భగవంతుని వరప్రసాదుడు కాడని లక్ష్మీ దేవతాప్రసన్నుడసలే కాదని, తేలిపోయింది. దీనితో పూర్వవిశ్వాసాలన్నీ పరాస్తమయ్యాయి. శరీరం ఒక శాస్త్ర దృష్టికి విశ్లేషణ పొంది వైద్యశాస్త్రాభివృద్ధికి దోహదం చేసినప్పటికి మానవుని జీవితాన్ని పరిపోషించే ఆత్మ అనే పదార్థం ఏ మూలనైనా ఉన్నదేమోనన్న సందేహం శాస్త్రకారులను చప్పున ఒదిలింది కాదు. శరీరం వలెనే మానవుని మనస్సు అనే మెదడుకు కూడా అనేక అంతర్భాగాలూ, కృత్యాలూ ఉన్నాయని అది చేతనావ చేతనలకు పరిమిత మైననదని, దానికీ రోగాలూ నివారణలూ సంభవమేననీ పరిశోధించి, మన స్తత్వ శాస్త్రాన్ని విపులీకరించిన సిగ్మండ్ ఫ్రాయిడ్ మూడవవాడు. కాలదూరాలకూ స్థలాంతరాలకు గల సంబంధాన్ని వింగడించి సాపేక్ష సిద్ధాంతాన్ని నిర్ధారించిన ఐన్‌స్టయిన్ నాలుగవ మహర్షి. ఈ నలుగురూ మానవజాతి ఆలోచనా విధానాలను మార్చివేశారు. విశ్వాసం స్థానంలో వివేచనను పాదుకొల్పారు. సంప్రదాయ మూఢాచారం స్థానంలో ప్రయోగ వాదాన్ని ప్రతిష్ఠించారు.

ఈ వైజ్ఞానిక విజయాల ప్రభావం ఆధునిక సాహిత్యస్వరూపాన్ని ఎంతగానో మార్చివేసింది. సమకాలీన సమస్యలకేగాక సర్వకాలాల సమస్యలనీ పరిష్కరించుకోగల నిర్దిష్టమార్గాల నేర్పరచింది. అందువల్లనే 20 వ శతాబ్దంలో వచ్చిన సాహిత్యమంతా హేతువాదబద్ధమూ, ఆధునికమూ అని చెప్పడానికి ఆస్కారం లేనట్లే- ఆధునికతా నిర్వచనానికి లోబడేదంతా ఈ శతాబ్దపు వైజ్ఞానికశాస్త్ర, ప్రభావజన్యమే ననడానికి అవకాశంలేదు. అంటే మనం ఆధునికత స్వరూప స్వభావాలకిచ్చే నిర్వచనానికి లోబడి మనగలిగే సాహిత్యం సకృత్తుగానైనా పూర్వశతాబ్దాలలో ఆవిర్భవించే వుందని గుర్తించక తప్పదు. అంటే ఆధునికత్వానికి మనమిచ్చుకొనే నిర్వచనం

కాలాతీతమైంది దేశకాలపాత్రాధీనం కాని ఒకానొక తాత్త్విక చైతన్యానికి సంబంధి.

ఆధునిక వైజ్ఞానిక వికయాల ద్వారా లభించిన వివేచన కరదీపంగా సాగిన ప్రయోగవాద సాహిత్యాన్ని మాత్రమే మనం ఈ యుగాన ఆధునిక సాహిత్యంగా పేర్కొంటున్నాం. అంటే గుణాత్మక కళాసాహిత్య స్వరూప స్వభావగత ప్రక్రియా విశేషాలను మాత్రమే ఆధునిక మనడానికి మన సంసిద్ధత తెలుపుతున్నామన్నమాట. ఏరంగంలో కాని ప్రయోగవాదం సాహసికయాత్రవంటిది. గతానుగతికంగా సాగిపోవడం నిరపాయకరం. తెలుగుకవిత్వంలో వికసిస్తున్న ఆధునిక చైతన్యాన్ని సక్రమంగా నిర్వచించుకొని, కొత్తవిలువలను ప్రతిపాదించుకొంటూ సాగుతున్న కవితా విస్పష్ట స్వరూపాన్ని అవగాహన చేసుకుందుకు నా ఈ ప్రసంగం ఉపలక్షితమైంది. దురదృష్టవశాత్తు మన విశ్వ విద్యాలయాల పండితులు గుడ్డెద్దువాటంగా పోతూ, ఆధునిక యోచనాధార నిమిత్తం పెట్టుకోకుండా- ఈ శతాబ్దానికి చెందిన పూర్వయుగావశేషానును కూడా ఆధునిక కవిత్వంగా చెలామణీ చేస్తున్నారు. దానిని సమకాలీన శబ్దార్థకంగా కంగాళీ చేసి విడిచిపెట్టారు. యుగపురుషుడు వీరేశలింగంగారిని ఒక కొండగుర్తుగా స్వీకరించి ఆ యుగంలో పుట్టిన ప్రతివాడినీ విచక్షణారహితంగా ఆధునికునిగా పిలుస్తూ ఈ పదానికి ఒక అర్థస్ఫురణ లేకుండా చేస్తున్నారు. కనక నేను ప్రధానంగా చెప్పేదేమంటే- ఆధునికత విశిష్ట నిర్వచనాత్మకమే తప్ప, నవ్యత్వానికి కూడా పర్యాయపదంగా నేనంగీకరించడంలేదు. ఆధునిక శబ్దం నిర్దిష్టలక్షణ లక్షితమైన గుణవాచిగా మాత్రమే మనం స్వీకరించాలని నేను మనవి చేస్తున్నాను. హేతువాదానికి లోబడేది, అంధవిశ్వాసాన్ని ప్రతిఘటించేది, సర్వజీవనరంగాలలోనూ పరిణామాన్ని ప్రయోగాన్ని ఆశించి సాగే సాహిత్యాన్ని, ముఖ్యంగా విత్వాన్నిమాత్రమే ఆధునిక కవిత్వంగా మనం నిర్వచించుకుంటున్నపుడు అలాంటి లక్షణం గలది ఏ యుగంలో ఉన్నదైనా ఆధునికమే కాగలదు. మధ్య యుగాలలో సైతం వేమనయోగి వంటి, మేరునగధీరులు ఎందరో ఆధునికులుగా దర్శనమిస్తారు.

మనం జీవిస్తున్న కాలం అతివిశిష్టమైనదేకాక, అతి విచిత్రమైంది కూడ, పరస్పర విరుద్ధభావాల్ని ఒకే హృదయడోలలో సహజీవనం నెరపు తున్నాయి. కొన్ని నిత్య సంఘర్షణా బద్ధమవుతున్నాయి.

ఆధునిక సిద్ధాంతాలను పరమ ప్రామాణికాలుగా విశ్వసించే కవులు ఎంత చైతన్య నిబద్ధులై కృషి సల్పుతున్నారో- గతానుగతిక సంప్రదాయ వాదులు సైతం అంతే దీక్షావిధితో వ్యవసాయం సాగిస్తున్నారు. ఇరువురి రంగభూమి జనహృదయ క్షేత్రమే పనక- సామాన్య పాఠకుడు తన అభి రుచి స్వరూపాన్ని ఇదమిద్ధంగా పోల్చుకోలేని నిస్సహాయుడు కావడమూ కనిపిస్తుంది. ఏ సిద్ధాంతంపట్లనూ మమేకత్వం పెంచుకొనలేక నిర్లిప్తత వహించడమూ కనిపిస్తుంది. వ్యక్తిగా అవసరాల ఆధారంగా- "రామా స్వస్తి, రావణాస్వస్తి" అనే అవకాశవాద వైఖరి అవలంబించడమూ కనిపిస్తుంది.

ఆధునిక యాంత్రిక నాగరికత అందించే జీవన సౌలభ్యాలను, సౌకర్యాలను అనుభవిస్తూనే విశ్వాసాలనూ హార్దిక ఆధారాలనూ సంప్ర దాయ వాదానికి అనుసంధించి సుఖంగా బ్రతుకుతున్న మేధావులూ ఉన్నారు. సూర్యచంద్ర గ్రహణాలకు పట్టువిడుపు స్నానాలు చేసే సైన్సు అధ్యా పకులూ ఉన్నారు. ప్రతిఉదయం శ్రీ వేంకటేశ్వర సుప్రభాతాదిక దేవతా ర్చన సజావుగా జరిపి, పాపట సింధూరధారణంతో కళాశాలలకు వేంచేసే వైజ్ఞానిక శాస్త్రవిద్యాధికులూ ఉన్నారు. శ్రీవిద్యోపాసకులైన యూనివర్శిటీ ఆచార్యులు- నక్సలైటు విప్లవాన్ని కీర్తిస్తూ కబుర్లుచెప్పే భాగ్యశాలురూ ఉన్నారు. ఈ విధంగా వర్తమాన మనోజీవుల వ్యాపారం అస్తవ్యస్త మవుతోంది. గతానుగతికత్వం అన్నిరంగాల్ని ఏలుబడి సాగిస్తూనేవుంది. ఇలాంటి దుర్దశావశేషంలో నూత్న సిద్ధాంతాలకు ఎలాంటి ఆదరణ లభి స్తుందో సందేహమే! కనక నేనిక్కడ ప్రతిపాదించే ఆలోచనలన్నీ- సర్వ జనామోదకరాలు, త్రికాలాబాధిత సత్యాలూ కాగలవన్న అహమిక నాకులేదు. ఒక ఆలోచనాజీవి త్రికశుద్ధిగా ప్రతిపాదిస్తున్న కొన్ని కొత్తఆలోచనలుగా స్వీకరించి శ్రోతలు తమ ఆలోచనలను పురికొల్పితేచాలు. కృతార్థుణ్ణే.

ఆధునిక చైతన్యం సమగ్రంగా గల రచయితలు మాత్రం సమకాలీన సాహితీరంగంలో ప్రయోగశాలితతో వినుత్నతీరాలను అన్వేషిస్తూనే ఉన్నారు. కొత్తవిలువలను స్థాపిస్తూనే ఉన్నారు. నవనవోన్మేష ప్రతిభాశాలులై కవితా విన్నూత రేఖలు వెలార్చడానికి సాధన చేస్తూనే ఉన్నారు. ఆ విధంగా వర్తమాన సాహిత్యంలో ఒక గణనీయమైన భాగంగా ప్రవర్ధిత మవుతూనే ఉంది ఆధునికత్వం.

తెలుగు కవిత్వంతో ఆధునికత ఏదో, ఎలాంటిదో పోల్చుకుందుకు ఈ ధనధ్రువం పట్లనే మన దృష్టి కేంద్రీకరించాలి. మిగిలిన పూర్వావశేషభావజలాన్ని విస్మరిస్తే చాలు తనంత తానుగా అదే పరాస్తం కాగలదు.

సంప్రదాయ సాహితీ సిద్ధాంతాలను బుద్ధిపూర్వకంగానే ఆధునికులు త్రోసి రాజంటున్నారు. వినూత్న సజీవ సిద్ధాంతాలను అంతర్జాతీయ చైతన్యంనుంచి పరిగ్రహించి పరివుష్టం చేసుకుంటున్నారు. మన సాహితీ చరిత్రలో అపూర్వమూ, వర్తమాన కవితాలోక జీవశక్తిఅగు నవమానవీయ సిద్ధాంతాన్ని ఫలభరితం చేస్తున్నారు.

వర్తమాన కవితారంగంలో ఆధునిక చేతన ఎంత విశేష ప్రాధాన్యతపొంది వున్నప్పటికి అధికారికమైన ప్రాముఖ్యత దానికింకా లభించ లేదు. సంప్రదాయ వాదానికే సాహితీ సభా మూలకమైన అగ్రతాంబూలం లభిస్తోందింకా. సమకాలిక కవులలోనూ ఆధునిక చైతన్యాన్ని సమగ్రంగా గుర్తించని వారే అధికసంఖ్యాకులు. కాని కవితా రంగంలో ఆధునికత్వానికిగల నాయక స్థానాన్ని పరిగణించని నిర్లిక్ష్యవైఖరి మాత్రం వారికిలేదు. కళామూల్యాల పరిశీలనలో ఆధునిక భావధార సర్వత్రా స్వీకరింప బడటం లేదు.

ఈ శతాబ్దారంభంలో ఆధునికులైన వీరేశలింగం, గురజాడ అప్పారావులకు విరోధులుగా సంప్రదాయవాదాన్ని నిలప ప్రయత్నించినవారు వేదం వెంకటరాయ శాస్త్రి, కొక్కొండ వెంకటరత్నం, జయంతి రామయ్యపంతులు, కాశీభట్ల సోదరులు ప్రముఖులు. వర్తమానయుగంలో

విశ్వనాథ సత్యనారాయణ వారి శిష్యబృందమూ, ఆధునికతకు బద్ధ శత్రువులు.

ప్రస్తుతం నాగరికతా జీవితంలో వస్తున్న మార్పులన్నీ వైజ్ఞానిక సాంకేతిక రంగాలలో సాధింపబడిన విజయాల సత్ఫలితాలేనని స్థూలంగా అందరూ అంగీకరిస్తారు. వర్తమాన నాగరికత అందించే సౌకర్యాల ననుభవించడంలోనూ ఎవరికి ఎట్టి అభ్యంతరమూ ఉండదు. కాని ఈ చైతన్యాన్ని కవిత్వాది కళలూ నిర్వహించవలసిందే అంటేమాత్రం అంగీకరించరు. దానికి కారణం వారి హృదయాలు గతించిన లోకానికే లగ్నమై ఉంటాయి. పైగా వారికి ఆధునిక వైజ్ఞానిక చైతన్యం సంప్రదాయ పురాభవనాల పుట్టకీల్లు కదల్చివేయగలదనే భయం పిడిస్తుంది. గతానుగతికంగా తిష్టవేసుకున్న మత, కుల, సాంఘిక నైతిక ఆర్థికాది విశ్వాసాల కన్నిటికి ఆధునిక చైతన్యం గొడ్డలిపెట్టు కాగలదని వారు ముందే గ్రహించారు.

వైజ్ఞానిక శాస్త్ర, ప్రయోగాలకు కేవలం లేబొరేటరీకి మాత్రమే పరిమితం చేయాలని దైనిక సాంఘికాది సమస్యలతో దానికి నిమిత్తం లేదని ఇంకా ఒకవర్గం విశ్వసిస్తూనే ఉన్నది. ఈ వర్గంకూడా చివరికి సంప్రదాయ వాదం వైపుకే మొగ్గు చూపుతుంది.

ఆధునిక వైజ్ఞానిక శాస్త్రం సర్వతోముఖ చైతన్యం కలిగిస్తుందనీ సాంఘికాది సమస్యలకే కాక, కళాసౌందర్య రసభావాదులన్నింటా తన ప్రభావం కలిగించి తీరుతుందని, ఆ ప్రభావాన్ని బుద్ధిపూర్వకంగా జాగృత హృదయంతో అందుకొని నిబద్ధిత స్పృహతో దోహదం చేయడం ద్వారానే వర్తమాన సామాజికార్థికాది వ్యవస్థల రూపురేఖలన్ని సర్వతోముఖ పరివర్తనం పొందగలవని మరో వర్గం విశ్వసిస్తోంది. అప్పుడే మన నాగరికత పరిపూర్ణత నందుకోగలదని ఈ వర్గం భావిస్తోంది. సాహిత్య కళారూపాలన్నింటా ఆధునిక భావధార పతిష్ఠమతం కావాలని ఈ వర్గం సిద్ధాంతీకరిస్తుంది.

ఈ కాలంలో ప్రచురితమవుతున్న సర్వ సాహిత్య కళారూపాలు

ఆధునిక చైతన్యంతో సంపూర్ణప్రమేయం కలిగే ఉంటున్నాయి. ముద్రణా యంత్రం మన సాహిత్యరంగాన్ని పాలించనారంభించిన తర్వాత వ్యక్తిగత అభిరుచులకు యిష్టాయిష్టాలకు అతీతంగా ఎంతో కొంత అధునిక సాహిత్య ప్రక్రియల స్వరూప స్వభావాలతో పోడసూపుతూనే ఉంది. ఐతే కవుల చైతన్యంలో ఆధునికత్వం ప్రథమ ప్రమేయమైతే, అనేక విషమభావాల స్వైరవిహారం ముగిసిపోతుంది. ఆధునిక మానవాత్మ సాధురసాస్వాదన మరింత సత్వగుణావలంబిక మవుతుందని విశ్వసించడంలో అబ్బురంలేదు.

తెలుగు కవిత్వంలో ఆధునికతా లక్షణాభి వ్యక్తిగా ప్రథమ పురుషైక వచనమైన నేను మొదటిసారిగా 1910 లో గురజాడ అప్పా రావుగారి "గుత్తునాముత్యాల సరముల కూర్చుకొని మేలయిన మాటలు" అంటూ ప్రారంభమైన గేయంలో దర్శనమిస్తుంది. స్టూవర్ట్ హీమ్స్షైర్ అనే ఆంగ్ల విమర్శకుడు తెల్పినట్లుగా- ఈ సాహిత్య సంబంధి అహమిక ద్రవస్థితిలోని వ్యక్తిత్వానికి అభివ్యక్తి సాధనమే. ఇది రచయిత తాలూకు స్వీయవ్యక్తిగతమైన "నేను" తో ప్రమేయం కలదికాదు. ఒక జీవన విభాగపు ప్రతినిధి! ఈ అహమిక స్మృతులకు సాహిత్య పరంగా సాధించి, ఒక కేంద్రాన్ని పుష్టివంతం కావించుకుందుకు తోడ్పడుతుంది. ఈ ద్రవ స్వరూపమైన ఆహమిక సంఘటనల గొలుసు కట్టులోనుంచి అనుస్యూతంగా పరిస్థితులలో తేలుతూపోతుంది. ప్రతి పరిస్థితినీ కొంతలో కొంత మార్చుతుంది. ప్రతి సంఘటన పైనా దాని ప్రభావం ప్రసరిస్తూ సాగుతుంది. తాత్కాలికంగా కొన్ని ప్రధానమైన మార్పుల్ని పొందుతుంది. ప్రతిసారీ క్రొత్తదారుల వెంట తన ప్రవాహ గమనాన్ని సాగిస్తుంది. సంఘటనల ధారావాహికలో ప్రతిచిన్న అకృతీ వైవిధ్యాన్ని సంతరించుకుంటుంది. పరస్పర విభేధాన్ని సాధిస్తుంది. కాని ఆశ్చర్యజనకంగా ఈ ఈ అహమిక తనకుండే స్వీయవైయక్తిక ప్రయోజనాన్ని మాత్రం విస్మరిస్తుంది. పరిస్థితులలో అంతర్నిహితంగా నాయకపాత్రలీనాలీనంగా సాగుతుంది.

అన్న దీర్ఘ వికరణం- కొత్తగా ప్రవేశించిన ఈ "నేను" రూపాన్ని అర్థం చేసుకుందుకు ఎంతో తోడ్పడుతుంది.

హేతువాదబద్ధమైన ఆలోచనల పునాదిగా గురజాడ ప్రారంభించిన కవిత్వంలో మొదటిసారిగా ప్రవేశించిన ఈ నేను- మేముకు పర్యాయ పదంగా ద్రవరూప సమాజ వాహినికి ప్రతీకగా స్వీకృతమైంది. గురజాడ ముత్యాల సరాల ప్రారంభమే సంకుచిత కులతత్త్వానికి వ్యతిరేకంగా బరం పురంలో జరిగిన ఏకపంక్తి భోజన విందులో పాల్గొని రావడాన్ని గుర్తిస్తుంది. ఇది చైతన్యవంతంగా ప్రవేశించినదే తప్ప యాదృచ్ఛికం కాదు. ఆయన రచించిన ముత్యాల సరాల సంఖ్య అల్పమేకాని వానిలో ప్రధానంగా ఐదు ప్రముఖ లక్షణాలు మొదటిసారిగా ప్రాతినిధ్యం వహించాయి. అవి యివి. 1. సమకాలీన సామాజిక స్పృహను కవిత ప్రతిబింబించడం. 2. జడమయమైన సమాజానికి కవితా సంస్కరణతో చైతన్యం కలిగించడం 3. ప్రథమ పర్యాయంగా కథనరీతి ఖండకావ్య స్వరూపంలో ఆవిష్కృతమవడం. 4. దేశికవితా రీతిని పునరుద్ధరించి మార్గకవితాస్థాయికి ఉన్నతీకరించడం. 5. ఆత్మాశ్రయ ప్రేమ తత్త్వాన్ని ఆవిష్కరించడం. ఈ ఐదు ప్రధాన లక్షణాలూ తెలుగు కవిత్వంలో ఆధునికతనే ప్రాణలక్షణాలుగా ప్రతిష్ఠితమయ్యాయి.

గురజాడ వెనువెంటనే మరింత వేగంతో పెంపొందిన భావకవిత్వంలో- ఈ నేను- ఆత్మాశ్రయ హృదయవేదనలకీ, కవుల స్వీయవిషాదానికి (Self Pity) అభివ్యక్తి సాధనంగా మారి సంకుచితమైపోయింది. సార్వత్రిక జీవన ప్రాతినిధ్యం కోల్పోయింది. తిరిగి మరో ఇరవై ఏళ్ళ తర్వాత గురజాడ నెలకొల్పిన లక్షణాలను పునరుద్ధరించుకుని- శ్రీశ్రీ ద్వారా "నేను సైతం- ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను. అనే కవితలో దర్శనమిచ్చింది. ఈ జయభేరి మ్రోగించినవాడు ఫలానావారి కుమారుడైన శ్రీరంగం శ్రీనివాసరావు మాత్రమే ననే అర్థస్ఫూర్తి పాఠకుడికి ఎక్కడా కలగదు. ప్రపంచాగ్ని, విశ్వసృష్టి అనే పదసముచ్చయాల ద్వారా ఆధునిక కవి తన ప్రపంచ పౌరసత్వాన్ని అభివ్యక్తం చేస్తున్నాడు. పైగా విప్లవాత్మకంగా ప్రపంచాన్ని మార్చాలనుకుంటున్న శక్తులకు ప్రతినిధిగా ఈ నేను ప్రతీకాత్మకంగా నిలబడుతుంది. ఆధునిక కవితా పరిభాష

లోని నేను కేవలం స్వీయచరిత్రాభివ్యక్తి సంకేతం వంటిది కాదని మనం అర్థం చేసుకోవాలి. ఆధునిక నవలా రచయిత ఇ. ఎమ్. ఫారెస్టర్ ఈ అహమిక గురించి యిలా అంటాడు. "దీపికాకరణంలో ఇదొక నూత్న పద్ధతి" 2 అని.

అధునిక మేధావి, మహా రచయిత్రి వర్జీనియా ఊల్ఫ్ 1924లో ఒక విశ్లేషణ జరిపింది. ఒక విస్పష్టకాలముద్రను గుర్తిస్తూ ఆమె యిలా అంటుంది. "1910లో ఆంగ్ల సాహిత్యంలో ప్రప్రథమంగా ఒక ఆధునిక సంవిధానం ప్రబుద్ధమైంది" అంటూ నిర్ధారించింది. ఈ విశ్లేషణకు ఆంగ్ల విమర్శకులంతా అంగీకరించారు. సరిగ్గా అదే సంవత్సరం ఆధునిక భావ చేతన ఆంధ్రకవిత్వంలో నవజీవనాంకురాలనెత్తింది. ఈ అంతర్జాతీయ చారిత్రక సంఘటన తొలిముత్యాలసరంలో. తోకచుక్క దర్శనం ద్వారా రికార్డుచేయబడింది. ఇది యిటు కవితారచనలోనూ, అటు, నవ సమాజ రచనలోనూ ఆధునికతకు ప్రారంభమని తెల్పడమే తప్ప యాదృచ్ఛిక తను శోధించడం కాదు. ఈ ముత్యాలసరాల రచనతో సాహిత్యంలో తత్పూర్వం పాతుకుని ఉన్న విలువలు ఒక్కొక్కటే తమ ఉనికిపట్లు తప్పాయి. సాహిత్య ప్రతిబింబాలుగా మానవాను బంధాలు తారుమార య్యాయి. 1910 విశిష్టతను తెల్పుతూ వర్జినియా ఊల్ఫ్, తెల్పిన అంశాలు తెలుగు కవిత్వానికి ప్రత్యేకంగానూ, సార్వత్రికంగా సాహిత్యానికి స్పష్టంగా సరిపోతాయి. "All Human Relations have Shifted" అంటూ ప్రారంభించి ఊల్ఫ్ యిలా వివరిస్తుంది. "యజమానులకూ సేవ కులకూ గల సంబంధమూ, భార్యలకీ భర్తలకీ గల సంబంధమూ, తల్లి తండ్రులకూ బిడ్డలకూ గల సంబంధమూ అన్నీ 1910లోనే మార్పు పొందాయి. ఈ మార్పు స్పష్టంగా ప్రప్రథమంగా ఆంగ్ల సాహిత్యంలో ప్రతిబింబించింది. మానవ సంబంధాలలో మార్పు వచ్చినపుడే మతంలో సైతం మార్పు వస్తుంది. రాజకీయార్థిక సంబంధాలలోనూ మార్పువస్తుంది. సాహితీ ప్రక్రియలలోనూ మార్పువస్తుంది. విలువలన్ని మార్పులు పొందు తాయి"3 అంటుందామె.

మొదటిసారిగా గురజాడ ఈ మార్పులన్నిటికీ తన కవిత్వంలో విస్పష్ట ప్రతిబింబాలు నెలకొల్పాడు. 10 వ శతాబ్దం వరకూ తెలుగు కవిత్వంలో ప్రధాన పాత్రలవుతున్న పురాణ పురుషులూ ఉదాత్త రాజపాత్రలు తమ నెలవులు తప్పారు. సామాన్య పాత్రలు ప్రాణప్రతిష్ఠ పొందాయి. పూజారి కూతురు పూర్ణమ్మ, కవి, కవి భార్య, హరిజన బాలిక, వైదేశిక మిత్రులు, వంటి ఎన్నో పాత్రలు ప్రవేశించాయి. అందుకే ఆయన సర్వాత్మనా ఆధునిక కవిగా ప్రథమ దర్శనమిస్తాడు.

ఆధునిక కవిత్వంలో సన్నిహిత చిత్రణాత్మక వాస్తవిక వాద రచనా ధోరణి శ్రీశ్రీ ద్వారా అవిష్కృతమైంది. ఈ ధోరణి ఉద్ఘాటనారీతికి సన్నిహితంగా ఉండి సందేశాత్మకతని సద్యస్ఫోరకం చేస్తుంది. అటు కవితా కల్పనా దక్షమైన పదచిత్రవాదం శ్రీరంగం నారాయణబాబు ద్వారా ఆవిష్కృతమైంది. ఈ రెండు ధోరణులలోనూ కావ్యపరిభాషావ్యక్తిగా 'నేను' ప్రచలిత మవుతూనే ఉంటుంది. ఆధునిక కవిత్వంలో సామాజికాభివృద్ధి స్పృహ ననుసరించి ధన ఋణాంశలు రెండూ పరస్పర వైవిధ్యంతో పెంపొందుతూ గత ఏభయి ఏళ్ళుగా దర్శనమిస్తున్నాయి. అధివాస్తవిక, సమాజ వాస్తవిక ప్రతీకాత్మక పదచిత్రాత్మక వాదాలన్నీ రచనా శిల్పంలో అంతర్నిహిత మవుతూనే ఉన్నాయి. ఇవన్నీ ఆధునికమైన పారిశ్రామిక నాగరికతలో జన్మించిన విలక్షణ కళాధోరణులే. వీటి ఆస్తికత్వం తెలుగు కవిత్వంలో ఎలా విస్తరిల్లిందీ విచారించడం కూడా ఆధునిక పరిశీలనలో ప్రముఖ భాగమే.

గత శతాబ్దపు చివరి దశాబ్దాలలో మన సాహిత్యం ఆంగ్ల సాహిత్య ప్రభావంతో ఎన్నెన్నో వింత సొగసులు సంతరించుకొంది. పెంపు తరిగి అక్కడే గుడిసుళ్ళు పడుతున్న తెలుగు సాహిత్యంలో-ఎన్నో వినూత్న ప్రక్రియలు ప్రవేశించాయి. భారతీయ భాషా సాహిత్యాలన్నింటా అదే కాలంలో ఈ మార్పు ప్రబలతరమైంది. ఆంగ్ల సాహిత్యాధ్యయనం ఈ జాకేకి లభించకపోతే వర్తమానాంధ్ర సాహిత్యానికి ప్రపంచ పౌరసత్వం లభించే ఉండేదికాదు. పారిశ్రామిక ఉత్పత్తి సాధనాల ద్వారా యాంత్రిక నాగరికత ప్రవేశించింది. భూస్వామ్యాది విధానాలనుంచి సమాజం ముంద

డుగు వేయడానికి ప్రేరణ కలిగించింది. సామాజిక జీవితం సాధించిన అపూర్వ సంపదలన్నింటిని సాహిత్య జీవితం ప్రతిబింబించింది. ఒక్కొక్కప్పుడు సమాజంకన్న సాహిత్యమే ఒక అడుగు ముందుకుసాగి - భావ విప్లవానికి దోహదం చేస్తూ వచ్చింది. అంతర్జాతీయంగా సాధించబడిన వివూత్న సంపదలెన్నిటికో తెలుగు కవిత్వం కూడా కాణాచి కావడానికి అపూర్వావకాశం లభించింది. ఈ విధంగా ఒక మహాజాతి చరిత్రలో 1860 నుంచి 1980 వరకూ సాగిన నూటయిరవై ఏళ్ళకాలం మహోత్తమ పరిణామాలకూ, ఆధునిక చైతన్య విలసనానికీ ఆకరంగా నిలిచింది.

ఐతే పాశ్చాత్య దేశాల సాహిత్యాల ప్రభావంతో మన సాహిత్యం లోనికి ప్రవేశించిన కొన్ని నూత్నప్రక్రియలు ఇక్కడి నైసర్గిక పరిస్థితులకు పూర్తిగా దత్తంకాక మాడిపోలేదా అంటే పోవచ్చుగాక. అంతమాత్రంలో పాశ్చాత సాహిత్యాల ప్రభావం మన సాహిత్యాభివృద్ధికి నష్టం కలిగించిందని చెప్పబూనడం సత్యం కాదు.

మనజాతిజీవితంనుంచి భూస్వామ్యవ్యవస్థ Feuidal అవశేషాలన్ని పూర్తిగా వైదొలగి పోలేదు. పెట్టుబడిదారీ ఆర్థికవిధానాలు పాశ్చాత్య దేశాలకు మాదిరిగా సంక్షోభస్థాయికి పెంపొంది, తన ప్రభావం కళాసాహిత్య రంగాలపై ప్రసరించలేదు. రెండు ప్రపంచ యుద్ధాలు కాని, వాటినడిమి అనిశ్చిత స్థితిగాని భారతదేశాన్ని ప్రత్యక్ష ప్రభావంతో అతలాకుతలం చేయ లేదు.

సంప్రదాయవాదానికీ, ప్రయోగ వాదానికీ మధ్య విస్తరిల్లే వైరుధ్యం సాహిత్య రంగంలో బహుముఖీనంగానూ, నిశ్శబ్దంగానూ ఆవిష్కృతమవుతుందే తప్ప- రాజకీయవాదాల మధ్య అంతస్సంఘర్షణవలె ప్రస్ఫుటంగా అభివ్యక్తం కాదు. కాని ఈ శతాబ్దారంభ పాదాలలో సాహిత్యంలో గల ఎస్టాబ్లిష్‌మెంటుకీ ఆధునికత్వానికీ మధ్య సంఘర్షణ బాహా బాహీగా సాగ కనిపిస్తుంది. సంప్రదాయవాద సాహిత్యానికి సనాతన హిందూ మతవాద మితవాద ధోరణి మాతృత్వం వహిస్తుంది. ఆనాటి వ్యక్తి స్వేచ్ఛావాద

అవిష్కారానికి భావుకప్రతీకగా నిలచిన భావ కవిత్వానికి బ్రహ్మసమాజ మతం ఆలంబికమైంది. సనాతన హైందవమతం నుంచి విప్లవాత్మక యుగ ధర్మంగా పుట్టినదే బ్రహ్మమతం. ఆనాడు ఏకేశ్వరోపాసన ఉద్ఘాటింపబడటం దాదాపు నాస్తికత్వ ప్రచారం వంటిదే. పైగా దానికి హేతువాదమే ఆధార భూమిగా నిలచింది. ఈ నూత్న మానవతా మతం తత్పూర్వ కులతత్వాలను నిర్మూలించి సవర్ణ అవర్ణాదులతో సహా వివాహాది సర్వ సంబంధాలనూ పునరుద్ధరించి జాతిని ఏకస్థం చేసింది. అనేక నూత్న ఆలోచనలకు విప్లవాత్మక ప్రేరణ కలిగించింది.

పైన వివరించిన మతావలంబన సాహిత్యాలకు ప్రేరణ కలిగించినట్లే శాస్త్రీయ సామ్యవాద దృక్పథం ఒక అనివార్య ప్రబలశక్తిగా నైసర్గికమైంది కనక దాని చారిత్రక గతినీ స్థితినీ ప్రభావ విస్తృతినీ చర్చించుకోవడం కూడా ఆధునిక పరిశీలనలో అంతర్భాగమే. కవిత్వంలో ఆధునికత అంటే- ప్రధానంగా వర్తమాన సమాజంలో పొడసూపుతున్న మార్పులను గుర్తించి వానికి దోహదం చేయడమేనని అర్థం చెసుకోవాలి. మార్పు అంటేనే తత్పూర్వమెన్నడూ లేని కొత్త వ్యవస్థను ఆవిష్కరించు కోవడమే తప్ప వెనక్కి వెనక్కి పోవడం కాదు. మానవతా మూల్యాల పరిణామాన్ని త్రిశుద్ధిగా వాంఛించినవారే ఆధునికులు. ఈ గుణాత్మక దృష్టితో పరిశీలిస్తే సమకాలీనులంతా ఆధునికులు కాలేరని, ఎప్పుడో అరవై అయిదేళ్ళ క్రితం భౌతికంగా మరణించిన గురుజాడ తెలుగు కవిత్వంలో ఆధునికతకు పితృపాదులుగా కీర్తిదేహంతో జీవిస్తున్నాడనీ అర్థమవుతుంది. సమాజంలో ప్రవర్తిల్లే మార్పులను విస్పష్టంగా పోల్చుకోలేనివారు, వ్యక్తికీ పరిసరాలకీ నడుమగల సంబంధాలలో సంభవించే పరిణామాలనూ సంఘర్షణనూ సైతం దర్శించలేరు. ఆధునిక వైజ్ఞానిక శాస్త్రం ఆధునిక సమాజానికి ప్రభామండలంగా తనరారుతోంది. దీని ఆధారంవల్ల ప్రస్తుతం ప్రతి అంశం పట్ల ముందు వచ్చేది సంశయం, ప్రతి మేధా సమస్యగురించి ప్రశ్న వేయకుండా ఆచరణలోనికి అంగీకరించడం కుదరని విచికిత్స ప్రధానమవుతోంది.

దీనివల్లనే తరానికీ తరానికీ మధ్య అంతరమూ విస్పష్టంగా పెరు

గుతోంది. సామాజకంగా పొడసూపుతూన్న మార్పులన్నిటినీ రికార్డు చేయడమేగాక. రాగల పరిణామాలన్నిటినీ సీస్మోగాపు వలె Sel Smograph రికార్డుచేసి చూపవలసిన బాధ్యత కూడా ఆధునిక సాహిత్యానికి ముఖ్యంగా కవిత్వానికున్నదని, స్టీఫెన్ స్పెండార్ తనఉద్గ్రంథం **Struggle of the modern**కు ఉపోద్ఘాతం రాస్తూ ఉద్ఘాటించాడు.

వ్యవస్థీకృత సామాజక స్వరూపం యుగయుగాలుగా సాగివస్తోంది. ఈ సమాజ చిత్రంలోని అంతరి సంబంధాలు పూర్వమెప్పుడూ ఎరగనంత పునర్నిర్మాణం పొందుతున్నాయి. ఈ మార్పును తీవ్రతరం చేయడానికి ఆధునిక కవిత్వం రసావేశస్థాయిలో (**Emosionallevel**) ప్రయత్నించవలసిందే. సమాజపటంమీది రేఖల్నీ వర్ణాల్నీ నూతన పరిణామశక్తితో పునర్మించడానికి ఆధునిక కవిత్వం దీక్షవహించి తీరుతుంది. మౌలికంగానూ సార్వత్రికంగానూ పరిణామాన్ని త్రిశుద్ధిగా అంగీకరించే నూత్న శక్తులకు ఆధునిక కవిత్వం స్వాగతం పలుకుతుంది.

: — :

# శ్రీ శ్రీ సాహిత్యం - ఓ పరిశీలన

సి. వి.

---

"లోకాస్సమస్తా స్సుఖినోభవంతు" అంటూ తెల్లవార్లూ పొద్దుకూకులూ రామనామజపం జేసే కొందరు ప్రబుద్ధులు, శ్రీశ్రీ కవిత్వం భారతీయ సంస్కృతికీ జాతీయతకీ విరుద్ధమైందని విసుర్లు విసురుతుంటారు.

"నమ్మకు నవ్వలేనివాడిని
పువ్వులు చిదిమేవాడిని

బరిమీద వదలిన పాముని
చైనావాడిని."

(తిలక్ - "త్రికాలం" రచన - సమరగీతి కావ్యసంకలనం - హైదరాబాదు.)

భారత చైనా సరిహద్దు సంఘర్షణా కాలంలో వచ్చిన కవితకి పై రచన మచ్చుతునక! సరిహద్దు సంఘర్షణల్ని శాంతియుత సంప్రదింపుల ద్వారా గాకుండా, సంగ్రామ రంగంలో పరిష్కరించుకోలేమని తాష్కెంటు ఒడంబడిక నొక్కివక్కాణించింది. వొక దేశానికీ, మరొక దేశానికి, సరిహద్దుల రీత్యా వివాదం వస్తే అవతలిజాతి మొత్తాన్ని (చైనావాడిని) పాముకింద జమకట్టి నమ్మవద్దంటూ ప్రబోధించేది జాతీయాభిమానమో, కాక జాతీయదురహంకారమో తేల్చవలసింది పాఠకులే!

ఏది భారతీయ సంస్కృతి-మరేది జాతీయత, అనేవి తీవ్ర వివాదాస్పద విషయాలు. మధ్యాసియా నుండి వలస వొచ్చిన ఆర్యులు భారత దేశంలో స్థిరపడి, అప్పటికే దేశంలో జీవిస్తోన్న మంఘ్మేరులనో, ద్రావిడులనూ దిక్కు దిక్కులకి తరుమగొట్టి, వైదిక సంస్కృతిని పెంపొందించారు. ఈ వైదిక సంస్కృతే భారతీయ సంస్కృతి అని బూకరించే గుడ్లగూబలు నేడు దేశంలో తిరిగి తలెత్తుతున్నారు. అయితే, మహాకవి శ్రీశ్రీ మాత్రం వీరు ప్రదర్శించే వొంటికన్నుతనాన్ని ఏనాడూ తన రచనల్లో ప్రదర్శించలేదు! నిక్కమైన భారతీయ సంస్కృతిని జీర్ణించుకొన్నవాడు గాబట్టే ఆయన ఈ విధంగా పలుకగలిగాడు-

"యముని మహిషపు లోహఘంటలు
మబ్బు చాటున ఖణేల్ మన్నాయి!"
"ఉదయ సూర్యుని సప్తహాయములు
నురుగులెత్తే పరువు పెట్టేయి!"
"ఆది సూకర వేదవేద్యుడు
ఘుర్ఘురిస్తూ కోరసాచాడు!"

మహాప్రస్థానం - అవతారం - పేజి 24)

"నిర్వికల్ప సమాధిలో
నా ప్రాణం నిర్వాణం పొందిందో"
"నా సుడి నీ గుడిగా
నా గీతం నైవేద్యంగా హృద్యంగా అర్పిస్తానో"

(మహాప్రస్థానం – కవితా ఓ కవితా – పేజి 36.)

"ఇదేమి! లోకం హిరణ్యనేత్రుని
పదా ఘాతమున ప్రతిధ్వనించగ,
కురుక్షేత్రమున క్రుద్ధ వృకోదరు
గదా ఘాతమున గజగజలాడగ"

(మహా ప్రస్థానం – జ్వాలాతోరణం – పేజి – 25.)

"లోకాలు,
భవభూతి శ్లోకాలు.
పరమేష్టి జూకాలు, నా మహోద్రేకాలు!"

(మహాప్రస్థానం – పేజి – 20)

"అవనీమాత పూర్ణగర్భంలా
ఆసియా ఖండం ఉవ్విళ్ళింగింది
నవ ప్రపంచ యోని ద్వారం
భారతం మేలుకుంటోంది."

(ఖడ్గసృష్టి – పేజి – 36.)

భారతీయాత్మను ఆకళింపు చేసుకొననివాడు, ఈ రచన చేయగలడా అని – సాహిత్య నికషోపలం గుడ్లగూబను ప్రశ్న వేస్తున్నా. మహాప్రస్థానం మహాకావ్యమని అంగీకరించినా, "గర్జించు రష్యా" వంటి గేయాన్ని ఉత్తమ సాహిత్య ఖండమని, "సహృదయ సాహిత్య రసజ్ఞులెవరూ అంగీకరించరు–" అనే విమర్శ ఆ మహాకావ్యం ప్రచురింపబడిన లగాయితూ ఈ నాటికీ వినవస్తోన్న పాచిపాటే!"

# 1955 లో అపవిత్ర యుద్ధం

**1955** ఫిబ్రవరిలో జరిగిన మధ్యంతరపు ఎన్నికల సమయంలో, ఆంధ్రదేశంలోని ప్రజాతంత్ర శక్తులపైననేగాక, సమస్త ప్రగతిశీల సాహితీ ధోరణులకి పతాక సంకేతమైన మహాకవి శ్రీశ్రీ పైనగూడా, నాటి పెట్టుబడిదారీపత్రికలూ, "ప్రజాస్వామ్యపరిరక్షణార్థం" "వీరకంకణం" దాల్చిన రచయితలూ, తీవ్రమైన గాలిదుమారం లేపారు. ఈ గాలి దుమారంలో, యిటీవలే మరణించిన బాలగంగాధరతిలక్ గూడా భాగస్వామి యనే విషయం చరిత్రలో చెరిపివేయులేని సత్యం! శ్రీశ్రీ విదేశీ మానస పుత్రుడనీ, ఆయనకి జాతీయాభిమానం పిసరంతయినా లేదనీ, వీరు నానా కారుకూతలూ కూశారు. ఆయనకి ఎన్నో "ప్రేమ" లేఖలు రాశారు! ఆ సమయంలోనే, "పెట్టుబడికి, కట్టుకధకి పుట్టిన విషపుత్రిక" ఆంధ్ర పత్రికలో "ఒక రచయిత" పేరిట శ్రీ పండితారాధ్యుల నాగేశ్వరరావు "గర్జించు రష్యా" గేయాన్ని విమర్శిస్తూ నానా అవాకులూ చవాకులూ పలికారు. దాన్ని పురస్కరించుకొని, నాటి దినపత్రికల్లో వివిధ రచయితల మధ్య తీవ్రమైన వాద వివాదాలు జరిగాయి. అనేకానేక భీషణ సాహితీ సంగ్రామాల్లో నిలిచి పోరి గెలిచిన ఆ నవయుగ కవితా నాందీప్రస్తావకుని తరపున, అభ్యుదయ రచయితలు దారుణమైన సాహితీ సమరాన్నే చేయవలసి వొచ్చింది. వైదిక ధర్మవృద్ధ జంబుకాలకీ, వారి దోపిడీ సంస్కృతికీ ఆలవాలమైన నేటి కృష్ణాపత్రికలో "సాహిత్య నికషోపలం" ద్వారా ముదిగొండ శివప్రసాద్ "జాతీయత" పేరిట ఈనాడు గురజాడ, శ్రీశ్రీ లపై మళ్ళీ గురితప్పిన గులకరాళ్ళు విసురుతోన్నాడు ! ! !

1955 ఫిబ్రవరి ఎన్నికల సందర్భంగా శ్రీశ్రీపై రేపిన గాలి దుమారం అత్యంత తీవ్రమైనది. ఆ కాకిగోల ఆయనకి ఎంతో మనస్తాపం

కలుగజేసింది. తత్ఫలితంగా, ఆ ఎన్నికల అనంతరం రాసిన "మంచి ముత్యాలసరాలు" లో ఈ విధంగా అంటాడు-

"నన్ను తిట్టిన తిట్లతోనే
మల్లె పూవుల మాలకట్టెను
నాకు వ్రాసిన ప్రేమలేఖలు
పోస్టుచేయుట మానివేసెను."
"పాతపీపా పీతపాపా
పాడుకుంటూ తిరుగుతాయట
కొత్త గొంతుక చెవిని పడితే
గుడ్లు నిప్పులు చెరుగుతాయట."
"ఇదే నా కడసారి సలహా
ఇలాతే నీ మనీపర్సుని
ఆంధ్రపత్రిక కప్పుకొని
కారడవి కేగిందా రివాల్వర్."
"నేడు నా కంట్లో సివంగులె
నిద్రలో నిలిచే ఫిరంగులు
కాళ్ళ చుట్టూ కపాలాలే
గావ్యగీతీ కలాపాలు."

(ఖడ్గసృష్టి - పేజి - 39.)

పుస్తెకట్టిన మగడు మధ్యలో మరణించగా, దిక్కులేని అనాధలా మారిన యువతిని భర్తతోపాటు అమాంతం కాల్చేసిన హైందవ దుర్మార్గ సాంప్రదాయాన్ని చూసి, దహించుకపోయిన హృదయంతో, సతీ సహ గమన దురాచార పిశాచాన్ని ఈ దేశం పొలిమేర్లనుండి పారదోలేందుకు కంకణం కట్టిన దీనజన బాంధవుడు, భారతీయ సంస్కరణోద్యమ వేగు చుక్క - శ్రీ రామమోహన్‌రాయ్, లండన్‌కి సముద్రంపై ప్రయాణం చేస్తోండగా, మార్గమధ్యంలో ఫ్రెంచి పతాక కనిపించింది. వెంటనే లేచి గౌరవాభివందనం చేశాడు. ఆయనలా చేసింది - దేశద్రోహ బుద్ధితోనా?

విజాతీయ మన స్తత్వంతోనా? ఫ్రెంచి భావదాస్యానికి లోనయ్యా? కాదు - కాదు - తరతరాలుగా మానవుడు అనుభవించిన భూస్వామ్య రాచరిక నిరంకుశత్వాన్ని కూలద్రోసి, స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం ఆదర్శాలను తన 1789 విప్లవం ద్వారా, విశ్వమానవాళికి అందజేసిన ఫ్రెంచిజాతికీ, దాని పతాకానికీ, ఆయన వందనం చేశాడనే విషయం ఇంగిత జ్ఞానమున్న ప్రతివాడూ గుర్తించగలడు.

## గర్జించు రష్యా - గేయం

1938 ప్రాంతాల, ప్రపంచ ఫాసిస్టు వశక్తులు పాలుపోసి అల్లారు ముద్దుగా పెంచి పెద్దజేసిన వెయ్యిపడగల నాజీనాగు, విశ్వమానవ స్వేచ్ఛను మృచ్ఛిలించేందుకు సిద్ధమైంది. మానవ స్వాతంత్ర శాంతులకీ, అస్తిత్వానికీ ఆనాడు ఘోరమైన ఉపద్రవం వాటిల్లింది. అలాంటి విపరీత విపత్కర పరిస్థితుల్లో, 1941 లో సోవియట్ రష్యాపై జర్మన్ ఫాసిస్టులు వొక్కుమ్మడి విరుచుకపడ్డారు. మానవ స్వాతంత్ర్య పరిరక్షణ కోసం, హిట్లర్, ముసోలినీ, టోజోల నాయకత్వాన విజృంభించిన ఫాసిజాన్ని సర్వనాశనం చేసేందుకోసం, మానవేతిహాస చరిత్రలో దోపిడీ పీడనల్ని సమూలంగా పెరికివేసి నవ్యమానవ వ్యవస్థకి అంకురార్పణ గావించిన ప్రప్రథమ సోషలిస్టుదేశ సంరక్షణకోసం, అరివీర భయంకరుడైన స్టాలిన్ నాయకత్వాన సోవియట్ సైనికులు రణరంగంలోకి సివంగుల్లా దూకారు. ఆ సమయంలో మహాకవి శ్రీశ్రీ ఆకాశం ఎత్తున పొంగి -

"గర్జించు రష్యా
గాండ్రించు రష్యా
పర్జన్యశంఖం పలికించు రష్యా!
దౌర్జన్య రాజ్యం ధ్వంసించు రష్యా!"

(మహాప్రస్థానం - పేజి - 86.)

అంటూ ప్రళయ భీకరరణన్నినాదం గావించాడు. మహాకవి ఆశించిన

విధంగానే, "వ్యక్తి స్వతస్సిద్ధ స్వాతంత్ర్య దాత, పతిత నిర్గతిక ప్రపంచ త్రాత", అయిన సోవియట్ సోషలిస్టు దేశం ఫాసిస్టు శక్తుల్ని నాశనం చేసి, స్టాలిన్ నాయకత్వాన తూర్పు యూరప్‌లో జనతంత్ర ప్రజాతంత్ర సామ్యవాద దేశాల ఆవిర్భవానికి అంకురార్పణచేసి, "భావికాల స్వప్నభవన నిర్మాత" గా నిరూపించుకొంది.

అలాంటి సోషలిస్టు దేశం గూర్చి, ఆ మహత్తర దేశం మానవ స్వాతంత్ర్య పరిరక్షణకోసం నిర్వర్తించవలసిన నైతిక బాధ్యతగూర్చి, ఆ దేశం విజయావకాశాలు గూర్చి శ్రీశ్రీ రచించిన "గర్జించు రష్యా" గేయం, షెల్లీ రాసిన "ఓడ్ టు ది వెస్ట్ విండ్" వంటి కవితా శకలాన్ని సైతం తలదన్నుకుంది. ప్రపంచ స్వాతంత్ర్యశాంతులకు ఉపద్రవం వాటిల్లిన ఆనాడు - శ్రీశ్రీ ఆ గేయం రాయడం సహృదయ సాహితీ రసజ్ఞుల దృష్టిలో సముచితం: సమంజసం. ఫ్రెంచిపతాకకి రామమోహనరాయ్ గౌరవాభివందనం చేయడం విజాతీయ మనస్తత్వానికి ప్రతిబింబమైతే, మహాకవి "గర్జించురష్యా" గేయం రాయడంతత్తుల్యమే! ఏతావాతా తేలిందేమంటే, ఆఉత్కృష్ట సాహితీ ఖండంలోని దోషమేమిటో ఈనాటికీ ఏ విమర్శకుడూ నిష్పక్షపాతంగా యెత్తిచూపలేకపోయాడు. జాతీయ దురహంకారాన్నే గుత్తగుకొన్న దేశభక్తిగా పరిగణించే వన్‌వే ట్రాఫిక్ ఒంటికన్ను రాంబాణాలూ, వైదికధర్మ బాకాల్లూ, తమ ద్వేషం విషాన్ని బక్కెట్లకొద్దీ కక్కవచ్చు విషం కక్కే కొద్దీ, ఆ రచన విలువ ఆకాశమంత ఎత్తున పెరుగుతుందనే సత్యం ఆ దివాంధాలు గుర్తించరు.

శ్రీశ్రీ విశ్వజనీనతని మానవతనీ, ప్రేమించి ప్రబోధించిన విశ్వమానవ కుటుంబీకుడు మాత్రమే కాదు. ఆయన జాతీయాభిమానం వున్న భారతీయుడు గూడా. భారత స్వాతంత్ర్య సమరంలో ప్రధానపాత్ర వహించిన గాంధిజీ, హఠాత్తుగా వోహ హిందూ మతోన్మాది పాశవిక హస్త క్రౌర్యానికి నిలువునా బలి అయిపోగా, మానవుడుగా, భారతీయుడుగా ఆయన విలపించాడు. భారతీయాత్మతో పాటు ఆయన గూడా చలించి, నిలువెల్లా కంపించి, హృదయం స్పందించగా, "సంభవామి యుగే యుగే" అనే

ఉత్కృష్ట రచన గావించారు. బహుశా, భారతదేశంలోని ఏ ప్రాంతీయ భాషలోనూ, యిలాంటి గీతం రచింపబడలేదు. ఈ మహోన్నత గీతమే, మహాకవి నిష్కలంక జాతీయతకి ఎదురులేని నిదర్శనం. గాంధీజీని, ఏ గాడ్సే పొట్టనబెట్టుకున్నాడో, ఆ గాడ్సేని వీరుడుగా పరిగణించే పచ్చి విద్రోహులు, నేడు శ్రీశ్రీలా జాతీయత లోపించిందని తప్పుడు కూతలు కూయడంకన్న దారుణమైన విషయం మరొకటి వుండదు.

## మహా సంకల్పం

తరతరాల బానిస బంధనాల నుండి భారతజాతి 1947 లో స్వాతంత్ర్యం పొందింది. స్వాతంత్ర్య దినోత్సవాన్ని పురస్కరించుకొని శ్రీశ్రీ రాసిన "మహా సంకల్పం" ఉత్తమ వచన కవితా రచన. ఇది ఆయనలోని నిష్కలంక దేశభక్తికీ, ప్రజానురక్తికీ ప్రత్యక్ష తార్కాణం. దీనిలో ఆయనచేసిన సూచనలు నేటికీ సూచనలుగానే వున్నాయి. నాటి స్వేచ్ఛ తెచ్చిన సమస్యలు నేటికీ అపరిష్కృతంగానే మిగిలివున్నాయి:

"ఇది నా స్వాతంత్రదిన
మహా సంకల్పం
విధిగా వికసించే
చరిత్ర కొూక కృతజ్ఞత
ప్రజలకు నివాళి
ప్రభవించిన నూతన భారత
పతాక కభివాదం" –

అంటూ భారత ప్రజలకు నివాళి అర్పించి, స్వాతంత్ర్య భారత పతాకకి అభివాదం చేస్తాడు. ఏ స్వాతంత్ర్యం కోసం దేశసేవానురక్తులూ, అధికులూ, అమాయకులూ ఆబాలగోపాలం లాఠీదెబ్బలు తిని, ఉరికొయ్యల్ని కౌగిలించుకుని, ప్రాణాలు తృణప్రాయంగా అర్పించారో, ఆ స్వాతంత్ర్యం లభించినపుడు, ఆయన హృదయం ఆనందడోలికల్లో తేలియాడింది. ఆయనకూడా ఆ మహోత్సాహ ప్రవాహంలో ఒక బిందువై స్వేచ్ఛావాయువులు పీలుస్తూ సాగిపోయాడు.

ఆ సమయంలో శ్రీశ్రీకి కనిపించింది. జాజ్వల్యమానంగా వెలుగుతోన్న విద్యుద్దీపాలూ కావు: రెపరెపలాడుతోన్న మువ్వన్నె జెండాలూ కావు: మిఠాయిల పంపకమూ కాదు: రేడియోల్లో వినిపించే రణగొణ ధ్వనులూ కాదు: విందులూ గోవిందులూ కారులూ కామాటాలూ అసలే కాదు. వాటినిగూర్చి వర్ణిస్తే, ఆయన శ్రీశ్రీ ఎట్లా అవుతాడు? అయితే ఆయనకు కనిపించింది ఎవరు?

"ఆ సమయంలో అందరి మనస్సు
లావరించె నొక వ్యక్తి
అందరిలోనూ ఆ సమయంలో
ఆవహించె నొక శక్తి."
"ఒక మహావటవృక్షం
హఠాత్తుగా నడిచినట్లుగా
ఒకే ఒక్క మానవమూర్తి
నా కళ్ళముందు కనిపించాడు
ఎంచేతో అతని ముఖంమీద
ఎప్పుడూ ఉండే పసిపాప నవ్వులేదు!"

ఎవరాతడు? కూటికీ గుడ్డకీ హీనపడి భీకర దారిద్రజీవితాన్ని గడుపుతున్న సామాన్య భారతీయుడే ఆ మానవుడు! అతని ముఖంలో కొంచెం విషాదం, కొంచెం విరాగం, కన్పిస్తోన్నాయని అంటాడు మహాకవి

"స్వతంత్ర భరతవర్ష వాస్తవ్యుడా మానవుడు
అర్ధనగ్నంగా ఆకాశాన్నే కప్పుకొని
నిండని కడుపుతో మండుతూన్న కళ్ళతో
ఇలా ఎంతకాలం ఇంకా నిలబడతాడా ప్రాణి?"
"అతణ్ణి జాగ్రత్తగా చూడండి
స్వతంత్ర భారత పౌరుడు
అతని బాధ్యత వహిస్తామని
అందరూ హామీ యివ్వండి
అతని యోగ క్షేమాలకు

అంత పూచీ పడండీ
అతికించండి మళ్ళీ
అతని ముఖానికి నవ్వు!

"ఇది మన కొాక దీక్ష సమయం
ఇది మనకి పరీక్ష సమయం

అని హెచ్చరిస్తాడు. స్వాతంత్ర్యం స్వరూప స్వభావాల్ని, అది తెచ్చే సమస్యల్ని గురించి శ్రీశ్రీ ఎంత స్పష్టంగా, మరెంత ప్రతిభావంతంగా నిర్వచిస్తాడో చూడండి-

"స్వాతంత్ర్య ఒక చాలా సున్నితమైన పువ్వు
చాలా వాడైన కత్తి, విలువైన వజ్రం
స్వాతంత్ర్యం తెచ్చే వెన్నెన్నో బాధ్యతలు
సామర్థ్యంతో నిర్వహిస్తామని సంకల్పం చెప్పుకుందాం."
(మహాసంకల్పం - పేజి 28)

## విషాదాంధ్ర

ఎందరో దేశభక్తులు అజ్ఞాతయోధులు అష్టకష్టాలుపడి పరాయి సామ్రాజ్యవాదులకి వ్యతిరేకంగా పోరాడి స్వరాజ్యం సంపాదించారు. కాని, ఆ స్వాతంత్ర్య ఫలితాలు సామాన్య ప్రజలకు దక్కలేదు. అంచేతనే శ్రీశ్రీ యిలాగన్నాడు -

"కష్టపడి ఆర్జించిన స్వాతంత్ర్యం
గద్దలు తన్నుకుపోతాయి."

(శరచ్చంద్రిక - పేజీ - 5)

అలాంటి దయనీయమైనపరిస్థితులు దేశాన్ని, ఆంధ్రదేశాన్ని, కారు చీకట్లలా క్రమ్ముకున్నాయి. "తెలుగువాని జీవితమే నేడొాక పేరడీ అయింది.

మన రాజకీయాలు, మన ప్రభుత్వం, మన రేడియో, మన సాహిత్య అకాడమీ. మన ధార్మిక విశ్వాసాలు, మన ఆధ్యాత్మిక అనుబంధాలు, మన అంతరంగిక వ్యక్తిత్వం, ఒక్కొక్కటీ ఒక పర్ఫెక్టు పేరడీ. జాతిజీవితమే ఒక పేరడీలా తయారైంది." (మల్లారెడ్డి గేయాలు - శ్రీ రాచమల్లు రామచంద్రారెడ్డి పరిచయ వాక్యాలు.) స్వాతంత్ర్యానంతరం తెలుగుజాతి జీవితమే వాహ కొత్త దశలో ప్రవేశించింది. మన తాతల మూతికి కొట్టిన నేతికంపు ఛాయలు కైతం మన దగ్గరికి జేరనంత అధోగతి పాలయ్యింది. అంచేతనే శ్రీశ్రీ. "ఏవితల్లీ!" రచనలో యిలా గన్నాడేమో?

"రుద్రమాంబా భద్రకాళీ
లోచనోజ్జ్వల రోచులేవీ?
ఖడ్గతిక్కన కదన కాహళ
కహ కహధ్వను లెక్కడమ్మా?"

"ఎక్కడమ్మా కృష్ణరాయని
బాహుజాగ్ర ద్బాడబాగుల్నూ?
బాలచంద్రుని, బ్రహ్మనాయుని
ప్రాణవాయువు లేవి తల్లీ?"

(ఖడ్గసృష్టి -41.)

1950-51 మధ్య కాలంలో తెలుగుజాతి జీవితాన్నీ, దాన్ని దుర్గతినీ చూచి ఆయన ఎంతో వ్యధ చెందాడు. తత్ఫలితంగా ఉద్భవించిందే "విషాదాంధ్ర" రచన. ఈ రచన, తెలుగు భూమిలోని నాయకులకే గాక, యావద్భారతంలోని బురఖా రాయుళ్ళందరికీ కొరడాదెబ్బవంటిది. చూడండి-

"బాకాలు లాభం లేదు బాజాలు లాభం లేదు
ఎంత యీదినా ఏం ఫాయిదా? ఎక్కడ తీరం కనబడదు
తల మాత్రం మీదికుంచి నిలువీత ఈదుతున్నాం
గమనం పిసరూ లేదు గమ్యం అసలే లేదు"

"అరవిందఘోష్టు ఆశీర్వదించాడు కదా
ముమ్మిడివరం బాలయోగి ఏమంటాడో

ఆంజనేయ దండకం వల్లిస్తేనో
అన్నట్లు సాయిబాబాకి మొక్కుకోకూడదు?"

కష్టపడి సంపాదించిన స్వాతంత్ర్యాన్ని గద్దలు తన్నుకు పోయాయి. అలాంటి స్వరాజ్యం యొక్క స్వరూప స్వభావాల్ని ఎంత ప్రతిభావంతంగా వర్ణించాడో చూడండి -

"ఈ గాంగేశీ వయస్సు ఇరవై అయిదేళ్ళు
ఇంకా ఎక్కువే అనుకో ఎవడు చూశాడు లెక్కలు
తీర్మానాలూ ఉపవాసాలూ చేశాం ఖద్దరూ కేకలు వేశాం
మోసుకొచ్చాంస్వరాజ్యమ్మూట-మూటవిప్పితే ఏమిలేదు-"

అంటూ నాయకుల వేషాలు ధరించిన వినాయకుల పీతనడకను అపహాస్యం పాల్జేసి, వర్తమాన ఆంధ్రజాతి విషాదావస్థను ఈ విధంగా వర్ణిస్తాడు-

"మహారణ్యంలో మధ్యాహ్నంలాగ ఒక స్తబ్ధత నిశ్శబ్దత
రాత్రిపూటవేట ముగించుకొని క్రూరమృగాలునిద్రిస్తున్నాయి
చిల్లరజంతువులు భయంతో ఎక్కడవక్కడ ఇరుక్కు
పోయాయి
ఎప్పుడైనా ఒకపక్షి ఎగిరితే ఎక్కడో ఒక ఆకురాలిన
చప్పుడు."

గౌతమీ కృష్ణవేణీ తుంగభద్రల జలాలు - తెలుగుతల్లి చనుబాలు- ఎందుకూకొరగాకుండా వృథాయైపోతున్నాయని శ్రీశ్రీ కంటతడి పెడతాడు-

"శిశువుకుదక్కని స్తన్యంలాగ ప్రవహిస్తున్నాయి గోదావరి
నీళ్ళు
బద్దలైన గుండెలాగ బీటలు వేశాయి పొలాలు
మన పరిశ్రమలు ప్రణాళికల్లోనే మనప్రతిభ చాకిరీకి తాకట్టు
మనికో ఇల్లంటూ లేదు రచ్చకెక్కి రాద్ధాంతాలు."

ప్రజాసామాన్యం యెడల తమ విధ్యుక్తధర్మాన్ని మరిచిన నాయకుల పై గేళి జేస్తో యిలా గంటాడు -

"కొంగల్లారా జపం చేయండి పిల్లీ పఠించు మంత్రాలు
ఎలకల్లారా సభ జరపండి ఎవరు గంట కట్టాలని
ఇంకోమారు ఎగరవే నక్కా ఈసారిఅందవచ్చు ద్రాక్షపళ్ళు
కోతి తీసుకురా త్రాసు పంపకం తెగడం లేదు."

(ఖడ్గసృష్టి - పేజి - 15·)

తన గురువర్యుడు - గురజాడ కవీంద్రుడు - 1908 మద్రాస్ కాంగ్రెస్‌పై పేరడీ రాశాడు. (చూడు - పేజి - 89·) తాను, ఆ కాంగ్రెస్ తీసుకొచ్చిన స్వరాజ్యాన్నీ, దాన్ని తమ తాతగాడి ముల్లెకింద మార్చుకొని వీరంగం వేస్తోన్న వినాయకుల్నీ ఈ రచనలో అపహాస్యం జేశాడు.

; — :

# మన తొలిపత్రికలు

-కె. వి. రమణారెడ్డి

దేశభాషా పత్రికల్ని చూసి బ్రిటీష్ దొరతనం అదురుకొన్న రోజులున్నాయి· దక్షిణాదిలో తప్ప తక్కిన అన్ని ప్రాంతాల్లోనూ 'రాజద్రోహకరమైన రచనలు మితి మీరుతున్నాయంటూ, ఈ పత్రికలను అదుపాజ్ఞలలో పెట్టాలని 1878లో ప్రభుత్వం వొక చట్టమే (Act IX) చేయాల్సి వచ్చింది. పరాయి పరిపాలన అక్రమంగా నిరంకుశంగా జులుం సాగిస్తూందని, దేశీయులంటే పాలకులకు ఖాతరే లేకుండాపోయిందని, సీమదొరలు గర్వపోతులుగా ప్రవర్తిస్తున్నారని రాయడమే సర్కారువారికి 'రాజద్రోహం' అనిపించింది· అచ్చుకావడానికి ముందే పత్రిక ప్రూఫులు

ప్రభుత్వాధికారులకు పంపుకోవాలి. బెయిలు-బాండు యిచ్చుకోవాలి. ఇది చండశాసనమే.

తొలిరోజుల్లో మన పత్రికలు గర్వించదగిన పాత్రను నిర్వర్తించాయని అనుకోవాలి. అయితే అప్పట్లో వాటికి గుండెబలం వున్నంతగా అర్థబలం అంగబలం వుండేవికావు. పైగా, కొన్ని ఏకభాషా పత్రికలైతే, మరికొన్ని ద్విభాషా పత్రికలు, ఇంకొన్ని త్రిభాషా పత్రికలు సైతం వుండేవి. ఇంగ్లీషులోనూ దేశభాషలలోనూ వెలువడే వాటిలో ఇంగ్లీషు కాలములు విడిగా అచ్చయ్యేవి. ఇది ఫాషనేగాక అప్పట్లో అవసరం కూడాను. ఇంగ్లీషు భాషాజ్ఞానమే సమాజంలో పై అంతస్తుకు సోపానంగా వుండేది కాదా! పైగా అది ప్రభుత్వ భాషకూడా అయెను!

దేశీయులేగాక యింగ్లీషు వాళ్లుసైతం ఈ పత్రికలకు ఆధిపత్యం వహించేవాళ్లు. ఇంగ్లీషువాళ్లు నడిపేపత్రికలు సహజంగానే ప్రభుత్వానికి వత్తాసిగా రాస్తూ వుండేవు. దేశ భాష పత్రికల విషయంలో వొక విశేషం వుండేది. ఒక ప్రాంతంలో ఆ ప్రాంతీయ భాషలోనే హెచ్చు సంఖ్యలో పత్రికలు రావడం అటుంచి, అక్కడ అన్య ప్రాతీయభాషా పత్రికలు ఒకటి రెండైనా వెలువడేవి. మద్రాసు రాష్ట్రం 1878 నాటికి ఎనిమిది వుర్దూభాషా పత్రికలు వుంటూ వచ్చాయి. ఈ పత్రికలన్నీ యెక్కువగా వారపత్రికలు, రెండు మూడు వారాల కోమారు వెలువడేవి కొన్ని మాసపత్రికలింకొన్ని దినపత్రిక అనేది అపురూపమే. 1872-77లో బొంబాయిలో4, బెంగాలులో, ఉత్తర భారతంలో1 వుండేవి. మద్రాసులో నాస్తి, బెంగాలు వారపత్రికల్లో సోమ్‌ప్రకాశ్, అమృత బజార్ పత్రిక, అప్పట్లో వార పత్రికలే. రస్త్ జో ఫ్తర్, నేటివ్ ఒపినియన్, బొంబాయి వారపత్రికల్లో ముఖ్యమైనవి.

వీటిల్లో అత్యధిక సంఖ్య నగరాలకు సంబంధించిందే అయినా, బెంగాల్లో గ్రామ ప్రాంతం నుంచి కూడా వార్తా పత్రికలు, గ్రామవార్తా ప్రకాశిక, బారిసాల్ వార్తావాహ, మూర్షిదాబాద్ పత్రిక కొన్ని వెలువడుతుండేవి. నగరాలలోనే లిథోగ్రాఫిక్, ప్రింటింగ్ ప్రెస్సులుండటబట్టి,

ఎక్కువగా నగరాలే పత్రికా కేంద్రాలు. 1870-80 మధ్యకాలంలో మద్రాస్ నుంచి 21, కొచ్చిన్ నుంచి2, మచిలీపట్నం నుంచి2, సేలం, శ్రీరంగం నుంచి చెరొకటి, పత్రికలు వెలువడేవని లెక్కలు

అప్పటికింకా సమిష్టియాజమాన్యం (జాయింట్ స్టాక్) వాడుకలోకి రాలేదు. విడివ్యక్తులే యజమానులు, ప్రచురణకర్తలూ తామే, ధనికులైన స్నేహితులో బంధువులో సాయంచేస్తూ వుండవచ్చు. రాజాలో జమిందార్లో దానధర్మాలు చేస్తూ వుండవచ్చు. అయినా వ్యక్తిమాత్రులే తమ పత్రికలకు నిర్వాహకులుగా వుంటూ, తమ రచనలతోనే వాటిని నింపేవాళ్లు. రెండు మూడు కాగితాల కంటె మించనందుచేత, యిదేమీ కష్టం అనిపించేదికాదు. 'సోమ్ ప్రకాశ్' నిర్వాహకుడైనా ద్వారకనాథ్ విద్యాభూషణ్ పగలంతా సంస్కృత కళాశాలలో పని చేసి, రాత్రిళ్లు పత్రిక పని చూసుకునేవాడు. 'నేటివ్ ఒపినియన్'లో విశ్వనాథ్ నారాయణ్ మాండలిక్‌వే సాధారణంగా రచనలన్నీ, 'ఇందు ప్రకాశ్'ను నిర్వహించిన రోజుల్లో మహాదేవ్ గోవింద్ రనడే స్వయంగా ముఖ్యమైన రచనలన్నీ చేసేవాడు. సంపాదకీయ మనేది విడిగా వుండకుండా, ఒక విషయం గురించి రాసిన వివిధ వ్యాసాలలో ఆ పత్రిక దృక్పథం ప్రత్యక్షమయ్యేది. పత్రికలకు రచనలు పంపేవాళ్లే లేరనికాదు. సంపాదకుడి పోరుపడలేకనో, స్నేహ ధర్మం మూలన్నో, వివాదాస్పదమైన విషయాల గురించి తమ తమ నిశ్చితమైన వైఖరులను ప్రదర్శించి తీరాలనే పట్టుదల వల్లనో, ప్రముఖులు కొందరు పత్రికలకు తమ రచనలు పంపుతుండేవాళ్లు. "జ్ఞాన ప్రకాశ్" అనే మరాఠీ పత్రికలో గోపాలకృష్ణ గోఖలే రచనలు వెలువడింది యీలాగునే.

సాహిత్య పత్రికలకు యువకవులు, ప్రసిద్ధ కవులు రచనలు పంపక తప్పేదికాదు. బనారసునుంచి బాబూ హరిశ్చంద్ర నడిపిన 'కవివచన్' పత్రిక యిలాంటిది. మద్రాసులోని వుర్దూ పత్రికలు విదేశ సమాచారం అందించిన రచయితలకు వొక్కొ వ్యాసానికి పాతిక రూపాయలు ముట్టి

జేప్పేవి. పత్రికలు నడవటమే గగనం రచనలకు పారితోషికం మాట 'దేవుఁడెరుగు'. ఒక వుత్తరాది ద్వైవారపత్రిక ఖర్చులు 1874లో 98 రూపాయలా నాలుగణాలు. ఆదాయం 140 రూపాయలు. ఇందులో 105 రూపాయలు జమీందార్లరాజాలనుంచో వచ్చేవి. వాళ్ళయినా తమనువిమర్శించ నందుకో విమర్శించినా మృదువుగా మర్యాద తప్పకుండా ఘనంగా విమర్శించేటందుకే యీ డబ్బు ముట్టజెప్పేవాళ్లు. తపాలా ఖర్చులు చాలా భారంగా వుండేవి. అందుచేత సర్క్యులేషన్ చాలా పరిమితం. ఎదో గొప్ప ఆదర్శంకోసం పత్రిక నడపబూనిన వాళ్లే వుచితంగా పత్రికను పంచిపెట్టే వాళ్లు. ఉదాహరణకు, 'రస్త్ గో స్తర్'ను ప్రారంభించి పార్శీ సమాజంలో సంస్కరణలు తీసుకురావాలనుకున్న దాదాభాయినౌరోజి, ఖర్షెడ్జి కాదూ యిలా చెయ్యడం మూలాన పదివేలరూపాయలు నష్టపోయారు. రచనల గురించి వ్యాఖ్యాలకు చాలా డబ్బు తగలడేది. రాజాలో జమీందార్లో కొన్ని పత్రికలకు అక్షరాలా మహారాజపోషకులే. రాజా దిగంబర్ మిత్రా భూరి విరాళంతోనే 'అమృతబజార్ పత్రిక' ఒక అచ్చుయంత్రం కొనుగోలు చెయ్యగలిగింది. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ తనకున్నదంతా వూడ్చి యివ్వకపోతే, 'సోమ్ ప్రకాశ్' వెలువడేదికాదు. దేవేంద్రనాథ్ టాగూరు అండతోనే 'ఇండియన్ మిర్రర్' ప్రారంభమైంది. తన నెలసరి ఆదాయంలో వందరూపాయలు 'హిందూ పేట్రియట్' కోసం హరిశ్చంద్ర ముఖర్జి వెచ్చించేవాడు. కొన్ని పత్రికలను మచ్చిక చేసుకునే దురుద్దేశంతో ప్రభుత్వమే ఆ పత్రిక కాపీలను హెచ్చు సంఖ్యలో కొనుగోలు చేసేది. ముందుగానే చందాలు కట్టేది. జిల్లా ఆఫీసులకూ స్కూళ్లకూ ఉచితంగా పంపేది. అలీఘర్‌లో బ్రిటీష్ ప్రభుత్వాభిమాని సర్ సయ్యద్ అహ్మద్ నడప సాగిన 'అలీఘర్ ఇన్స్టిట్యూట్ గెజెట్' మొత్తం సర్క్యులేషన్ 1877–78లో 297 కాపీలైతే, అందులో 63 స్థానిక ప్రభుత్వానికే చెల్లు. ప్రభుత్వానికైతే హెచ్చుధరకు కూడా అమ్ముకోగలిగేవాళ్ళు. అసలు, రేట్ల విషయంలో ధనికులకూ పేదలకూ తేడా, చాలా పత్రికలకు మామూలే. పంజాబీ పత్రిక "కోహినూర్" సాలుసరి చందా మామూలుగా 13 రూపా

యలేగాని రాజ, మహారాజ పోషకులకు మట్టుకు 50 రూపాయలదాకా వుండేది. సర్క్యులేషన్ స్థాయినిబట్టి కూడా రేట్లు మారుతుండేవి. అడ్వర్టయిజుమెంట్లు బహు కొద్ది. వెలువడబోయే పుస్తకాల గురించి సాహిత్య సమాచారం గురించి అడపా దడపా ప్రకటనలున్నా, యివివున్నతమో కాదో తెలియదు. మద్రాసులోని వుర్దూపత్రికలు మాత్రం ప్రతిపంక్తి అడ్వర్టయిజుమెంటుకూ రెండణాల రేటు పెట్టాయి. ఇక దేశ భాషాపత్రికలు వార్తల విషయంలో ఇంగ్లీషు భాషా పత్రికలమీద ముఖ్యంగా ఆధారపడేవి. రాయిటర్ న్యూస్ సాయాన్ని పొందిన తొలి బెంగాలీ భారతీయ పత్రిక, సురేంద్రనాథ్ బెనర్జీ నడిపిన "బెంగాలీ". ఇది కూడా 1900 లోనేగాని అంతకుముందు మాత్రం కాదు. రాయిటర్‌తో కాంట్రాక్టు యేర్పాటుచేసుకున్న తొలిపత్రిక బొంబాయి నుంచి వెలువడుతూ వచ్చిన "టైమ్స్ ఆఫ్ ఇండియా." విదేశ వార్తల కంటే చెవికోసుకోవడం మొదలైంది. 1911 దాకా రాజధానిగా వుండి నందుచేత, కలకత్తాయే ప్రభుత్వ వార్తా విషయంలో మిగిలిన ప్రాంతాల కంటె ముందంజ వెయ్యడం సహజం. బెంగాల్ ప్రభుత్వ గెజెట్‌లో చట్టాలగురించి, రకరకాల ప్రభుత్వ కార్యకలాపాలగురించి వున్న భోగట్టా ఇతర స్థానిక పత్రికలకు హతవేటు దూరంలోనే వుండేది. ఇలాంటి అధికార వార్తలు యెలాంటి భావాలు కలిపిస్తాయో పరిశీలించేందుకు దీన్నొక సాధనంగా ప్రభుత్వం వుద్దేశపూర్వకంగానే ప్రయోగించేది. ఉదాహరణకు దేశభాషా పత్రికల చట్టం వచ్చేరాకముందే, "అమృతబజార్ పత్రిక" అప్పటికప్పుడు ఇంగ్లీషుభాషాపత్రికగా రూపం మార్చుకోగలిగింది. దూర ప్రాంతాల పత్రికలకు యిలాంటి సులువు వుండేదికాదు.

రామమోహనరాయ్ రోజుల్లో, కొత్త కొత్తభావాలు వ్యాప్తిలోకి వచ్చి పత్రికలుసైతం విద్యాధికుల గౌరవాన్ని చూరగొన్నాయి. అలాంటివి మరికొన్నాళ్ళకు కర్ణకఠోర భావంగా మారింది.) పుబ్బలోపుట్టి మఖలో మాడే మొక్కల్లా అర్ధాయుష పత్రికలో పుట్టిగిట్టడం వొక కారణం కావచ్చు. మళ్ళీ ఆ తొలినాళ్ళ గౌరవం పత్రికలకు రావడానికి, 'సోమ్ ప్రకాశ్' 'అమృతబజార్ పత్రిక' 'సులభసమాచార్' 'బంగదర్శన్'

'సాధ్రారణి' వంటి పత్రికకు గొప్పదనమే కారణం. 'అమృతబజార్ పత్రిక' స్థాపకుడైన శిశిరకుమార్ ఘోష్ అమృతబజార్ గ్రామస్థుడైన ఒక జిల్లా కోర్టు వకీల్సుగారి కుమారుడు. కలకత్తాలో వున్నతవిద్య అభ్యసించాడు. తన జిల్లాలో యూరోపియన్ నీలిమందుతో యజమానులచేతిలో రైతాంగం దురవస్థలు గమనించి, మొదట 'హిందూ పేట్రియట్' పత్రికకు స్థానిక విలేకరిగా వుంటూ, తండ్రిమరణానంతరం బడిపంతులై, ఆపైన స్కూళ్ళ డిప్యూటీ యినస్పెక్టరై, ఆ తర్వాత ఆదాయంపన్ను శాఖలో వుద్యోగై చివరికి 28 ఏళ్ళ ప్రాయాన తన పత్రిక స్థాపించుకున్నాడు. మొదట్లో కొయ్యదిమ్మలతో చేతి- ప్రెస్సు వుండేది. తర్వాత కలకత్తాకు వెళ్ళి ఒక రాజా వద్ద అప్పుపట్టి ప్రింటింగ్ ప్రెస్ పెట్టాడు. ఇక 'సోమ్‌ప్రకాశ్' పత్రికా స్థాపకుడు సంస్కృతభాషావేత్త అయిన ద్వారక్‌నాథ్ విద్యాభూషణ్ ఆయన బహుగ్రంథ నిర్మాత. సంఘసేవానికతడు కూడా. ఇతనికి ఈశ్వర చంద్ర విద్యాసాగర్ అండదండలుండేవి. బెంగాలీ భాషా సంస్కృతులలో దిగ్గంతుల లాంటివాళ్లైనా, వీళ్ళకెవరికీ పాశ్చాత్యవిద్యావిజ్ఞానాలంటే నిరసన భావం వుండేవికాదు. వీళ్ళకుతోడు, పాశ్చాత్యభావాలలో నానిన వాళ్ళు కొందరు. ఉదాహరణకు, కేశవ చంద్రసేన్, క్రిస్టోదాస్‌పాల్. సేన్, ఇండియన్ మిర్రర్‌కు, పాల్ 'హిందూ పేట్రియట్'కు కొన్నాళ్ళపాటైనా ప్రాణశక్తులుగా వుండేవాళ్ళు. బ్రిటిష్ ఇండియా సొసైటీ సభ్యులు కూడాను. సేన్ ఇంగ్లాడు దర్శించి, జాన్ స్టూవర్ట్‌మిల్, మాక్స్‌ముల్లర్ మేరీ కార్పెంటర్ లాంటి ప్రముఖులతో ముచ్చటించి, గ్లాడ్‌స్టన్‌తోనే రాజకీయాలు లు చర్చించి వచ్చిన ఆధునికుడు. ఇక, పాల్ క్రైస్తవ మిషనరీల ప్రబోధానికి మనస్సు నర్పించుకున్న మనిషి. వీళ్ళంతా వొకెత్తు, గ్రామవార్తా ప్రకాశిక సంపాదకుడైన హరినాథ్ మజుందార్ వకడూ వకెత్తు. నదియా జిల్లాలోని సాదాజనం స్థితిగతులన్నీ మనస్సుకెక్కించుకున్న మజుందార్, బెంగాలీ గ్రామాల్లో సాగుతూ వచ్చిన అక్రమాలూ, అన్యాయాలూ తనకు "హృత్కవిలె" అన్నంత ప్రజాపక్షపాతి. ఎవర్నోపట్టుకుని యింగ్లీషు

నేర్చుకున్నాడు. పత్రికలు చదివి సాహిత్యజ్ఞానం సంపాదించాడు. 1863లో మాసపత్రికగా 'గ్రామ వార్తా ప్రకాశికం' స్థాపించి, 1869 నాటికి పక్ష పత్రికగా, 1876 నాటికి వారపత్రికగా వృద్ధిచేశాడు. ఈ క్రమంలో కృత్రిమమైన హంగులన్నీ జారవిడిచి, స్పష్టమైన రాజకీయ పత్రికగా తీర్చి దిద్దాడు. ఎవరినుంచి ఎలాంటి సాయమూలేదు. సంపాదకుడూ తానే, ఏకైక వ్యాసకర్తా తానే, పోస్టుబంట్రోతూ తానే, అందుకనే ఆర్థికంగా అది పైకి రాలేకపోయింది. మూతబడేనాటికి 1200 రూపాయల అప్పు మిగిలింది.

బొంబాయిలోని పత్రికల సంపాదకులు ఎక్కువగా విద్యావంతులు ముఖ్యంగా, ఎల్ఫిన్‌స్టన్ విద్యాసంస్థలో చదువుకున్నవాళ్ళు. మరాఠీభాషా పత్రికలూ పూర్తిగా యింతే ననలేము. 'ఇందుప్రకాశ్' సంపాదకుడు పండిత విష్ణు పరశురామ్ గాని, దాని యింగ్లీషు విభాగాన్ని నిర్వహించిన కనడేగాని, 'నేటివ్ ఒపినియన్' సంపాదకుడైన మాండలిన్‌గాని, యింగ్లీషు భాషా సంస్కృతులలో గట్టి ప్రవేశం కలిగికూడా, పాశ్చాత్య భావవ్యామోహంలో కొట్టుకు పోలేదనాలి.

1873 లెక్కల ప్రకారం దేశభాషా పత్రికల కన్నిటికీ కలిపి లక్షమందిని మించి పాఠకలోకం యేర్పడలేదు. అత్యంత అధికవ్యాప్తిగల పత్రికకు కూడా మూడువేలమందిని మించి పాఠకులుండేవాళ్ళుకారు. అయితే మనదేశంలో 'మౌఖిక: సంప్రదాయం యీనాటికీ మిగిలివుందనే వాస్తవం దృష్ట్యా, ఒకడు బిగ్గరగా చదువుతుంటే విని తెలుసుకునేవాళ్ళకు లోటుండేదికాదు. ప్రభుత్వానికి సింహస్వప్నంగా మారాయంటే. యీదేశభాషా పత్రికలు గ్రామాలకుకూడా వ్యాపించాయని అనుకోవాలి. 'బజార్ల'లో బిగ్గరగా చదివి వినిపిస్తారేమోనని అధికార్లు బెంగ, కాబట్టి చందాదార్లసంఖ్యను బట్టే యీ పత్రికల ప్రభావాన్ని అంచనా వెయ్యకూడదు. కొన్ని పత్రికలకు ప్రాంతాలను మీరిన ప్రచారం వుండేది. 'ఇండియన్ మిర్రర్' "హిందూ పేట్రియట్" "అమృతబజార్" పత్రికలవంటివి బెంగాలుకే పరిమితం కాలేదు. "సంవాద్‌భాస్కర్"లాంటి బెంగాలీ పత్రికలకు విదేశాలలో సైతం చందాదార్లు వుండేవాళ్ళు.

మనదేశంలో యూరపియన్లు నిర్వహించిన పత్రికలను గురించి టూకీగా కొన్ని మాటలు. వాటిది నిజంగానే వున్నతమైన స్థాయి. చివరికి ప్రెస్‌పనివాళ్ళు కూడా గ్రాడ్యుయేట్లే! టీ, కాఫీ, నీలిమందు తోటల్లో డబ్బు పెట్టుబడి పెట్టిన యూరోపియన్లు కొందరు పత్రికా ప్రపంచంలోకి గూడా డాబు దర్జాలతో దూసుకువచ్చారు. వీళ్ళకు ఆర్థిక యిబ్బందులు చాలా తక్కువ. పెద్ద పెద్ద వర్తకులు సైతం వాటాదార్లు. "టైమ్స్ ఆఫ్ ఇండియా" తాలూకు ప్రత్యేక మాసంచిక ఇంగ్లాండులో 40,000 కాపీలుఖర్చయ్యేది! ఇక్కడరోజూ 3,000 కాపీలు అచ్చువేసేవి! ఒక్కో కాపీయే రెండున్నరణాలు. దీనికీ, కలకత్తాలోని "స్టేట్స్‌మన్" పత్రికకీ, రోపరీ ప్రెస్సులుండేవి. ప్రారంభంలో, న్యూస్ ప్రింటుతో సహా ప్రింటింగు సామగ్రి అంతా ఇంగ్లాండునుంచి వస్తుండేది. సంపాదకులూ సీమదొరలే. వీరిలో విలియం మార్టిన్‌వుడ్‌లాంటివాళ్ళు ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ పండితులు. ఈవరకే అక్కడ కొందరికి పత్రికా నిర్వహణలో అనుభవం వుండేది. ఇలాంటి దొరలు పత్రికలన్నీ, ముఖ్యంగా "ఇంగ్లీష్‌మన్", దొరతనం బాకాలే.

దేనికది విడిగా వున్నట్లనిపించే యీ భిన్న ప్రాంతాల చిన్న, పెద్ద పత్రికలు, క్రమేపీ, ప్రభుత్వ విధానాలలో రాసాసిన మార్పుల ఫలితంగా. వొకదానికి మరొకటి మరింత దాపుగా రాసాగాయి. దీనినుంచి సమిష్టి వూపొకటి వచ్చింది. జాతీయవాద పత్రికాలోకం రూపొందసాగింది.

: — :

# నేటి పరిస్థితుల్లో సాహితీ, సాంస్కృతిక సంస్థల, ప్రజాకళాకారుల సాహితీపరుల కర్తవ్యాలేమిటి ?

జానకి చంద్రశేఖర్

---

ఈనాడు విర.సం గానీండి, జనసాహితి గానీండి, అ. ర సం గాని ఎందుకు చీలిపోతున్నాయ్? శక్తివంతంగా ఎందుకు పనిచేయలేక పోతున్నాయ్? అసలు ఈ సాహితీ ఉద్యమాల్ని తమ ఉక్కుపిడికిలిలో బంధిస్తున్న అంశాలేమిటి? వీటన్నింటిని ప్రతి అభ్యుదయ రచయిత, మార్పును కోరే కధలూ, కళాకారులు ఆత్మవిమర్శలు చేసుకోవాల్సిన తరుణం ఈనాడు ఆసన్నమయింది!

ఈ సంస్థలో చీలికలు రావటం వ్యక్తిగత ప్రయోజనాలకోసమో, లేక పెటీబూర్జువా లక్షణాల వల్లనో కాదు. అలాగే పూర్తిగా వాటిని తీసివేయడానికి వీలులేదు. ఈనాడు మొత్తం ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం చీలిపోయినట్లుగానే మన సాహితీ ఉద్యమం చీలిపోయింది. దేశీయంగా "కమ్యూనిస్టు" పార్టీల్లో ఏర్పడ్డ చీలికలు, గ్రూపులు "సాహితీ" రంగాన్ని తమ ప్రయోజనాల మేరకు బంధిస్తున్నాయి. అంతర్జాతీయంగా సోషలిస్టు దేశాల రాజకీయాలు కూడా "సాహితీ" రంగంపై అపారమైన ప్రభావాన్ని చూపిస్తున్నాయి, ఈనాడు ఏ "సాహితీసంస్థ" అయినా సరే తమ "సంస్థ"కు ఏగ్రూపుతోనూ "సంబధం" లేదంటూ ఎంతగా వాదించినా అది నిజం కాదని వారికి తెలుసు.

అసలు నేడున్న పరిస్థితుల్లో ప్రజాకళాకారుల కర్తవ్యాలేమిటి?

సాహితీ, సాంస్కృతిక రంగంలో భూస్వామ్య వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేఖ దృక్పథం ప్రచారంచెయ్యడం. అయితే నేటిసాహిత్య, సాంస్కృతిక సంస్థలేం చెబుతున్నాయ్. వాటి ఆచరణ ఏమిటో పరిశీలించాలి.

"భూస్వామ్య వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక" దృక్పథం ప్రచారం చేస్తామని అన్ని సంస్థలూ చెప్పుకుంటాయ్. వ. ర. సం, విషయానికొస్తే "మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనావిధానం" కట్టుబడి ఉన్నవారికి మాత్రమే అందులో స్థానంవుంది. "మా. లె· మా" ఆలోచనా విధానం అంటే "రష్యా"ను సోషల్ సామ్రాజ్యవాదంగానూ, ప్రపంచానికి ప్రథమ శత్రువుగానూ భావించి ఆ రకంగా రాజకీయాలను కొనసాగించటం వి. ర· సం ఏర్పరచుకున్న నిబంధనల మూలంగా "మా· లె· మా" ఆలోచనా విధానాన్ని అంగీకరించని వారికి అందులో స్థానం లేదు· అలాగే "మార్క్సిస్టులు" కాని "రచయితల్ని, కళాకారుల్ని" సమైక్యపరచే వేదికగా వి. ర. సం· దాని స్వభావాన్ని కోల్పోయింది.

'జనసాహితి' వేరు. ఇది 'మా·లె·మా' ఆలోచనను అంగీకరించాలనే నిబంధనల్ని ఏం ఉంచలేదు· అయితే రష్యాను 'సోషల్ సామ్రాజ్యవాదం' అనటం 'ప్రపంచానికి ప్రధమ శత్రువు' గా పరిగణించటంలో వాస్తవానికి ఆ ఆలోచనల్ని కొనసాగిస్తోంది. ఆ రకంగా పైకెంత ప్రజాస్వామిక విశాల ఐక్యవేదికను నిర్మిస్తున్నామని ప్రకటించుకున్నా ఆ "విశాలత" ను కోల్పోయింది. 'రష్యా' సామ్రాజ్యవాదంగా గుర్తించని బలమయిన ఓ వర్గం ఉండటమే అందుకు కారణం·

ఇంక అ. ర. సం. పాలకవర్గాల్లో అభ్యుదయాన్ని చూడటంతోనే దాని అభివృద్ధి ఆగిపోతుంది. 'రష్యాని' సోషల్ సామ్రాజ్యవాదంగా అంగీకరించని వారు 'జనచైనాను' దురాక్రమదారుణిగానూ' విస్తరణవాద దేశంగానూ, అమెరికా సామ్రాజ్యవాదంతో ఐక్య సంఘటనను కట్టింది గాబట్టి ప్రపంచ ప్రజలకు, విముక్తి ఉద్యమాలకు ప్రధమ శత్రువుగా పరిగణిస్తోంది. ఆ రకంగా 'జనచైనా' ను "దురాక్రమణదారునిగా" గుర్తించని మరో బలమైన వర్గానికి దూరం అయింది.

కాగా ఈ సంస్థలకు చెంది 'ప్రపంచ సోషలిస్టు శిబిరం' అంటూ ఒకటి లేదు. అలాగే సోషలిస్టు వ్యవస్థ నెలకొల్పబడినా క్రమంగా అది సామ్రాజ్యవాదంగానూ "దురాక్రమణ దారుని" గానూ తయారయింది. 'సోషలిజాన్ని' ఎవరిష్టం వచ్చినట్టు వారు భావించుకొని ఆ రకంగా రాజకీయాల్ని, సాహితీ, సాంస్కృతిక రంగాల్ని కొనసాగించే తీరు ఇది.

అసలు ఓ ప్రజా కళాకారుడికిగాని, సాహితీపరుడికిగాని ఉండాల్సిన లక్షణాలకు గీటురాయి ఏమిటి? అతడు "సోషలిస్టు వ్యవస్థ" యొక్క ఆవశ్యకతను కోరుకొంటున్నాడా? ప్రపంచ సోషలిస్టు శిబిరంలోని చీలికల కొనసాగింపు కోరుతున్నాడా? లేక ప్రపంచ సోషలిస్టు ఉద్యమ ఐక్యత కోరుతున్నాడా? అలాగే దేశంలో విప్లవశక్తుల ఐక్యత కోరుతున్నాడా? లేక చీలికల్ని ప్రోత్సహిస్తున్నాడా? లేదా? వీటిని బట్టి నిర్ణయించవచ్చు.

"సోవియట్ రష్యా" "జనచైనా" రెండూ గొప్ప సోషలిస్టు దేశాలు. "విప్లవం ద్వారా ఆయా దేశాలలో వ్యక్తిగతమైన ఆస్తి రద్దు కావింపబడి, సోషలిజం ఏర్పడి, బలపడుతూ కమ్యూనిస్టు సమాజంవైపుకు వెళ్ళే క్రమంలో ఉన్నాయ్. నిస్సందేహంగా పెట్టుబడిదారి దేశాలకంటే అన్ని రంగాలలో అభివృద్ధి సాగిస్తున్నాయి. పెట్టుబడిదారీ విధానం....

సామ్రాజ్యవాదం రోజు రోజుకు సంక్షోభంలో నెట్టబడుతుండగా.... ప్రపంచ సోషలిస్టుఉద్యమం ఎన్ని అసమానతలతో ఉన్నా.... ఎన్ని విభేధాలతో కొట్టుకుంటున్నా పురోగతి సాధిస్తుంది.! దానికి కారణం వాటి విధానాలే! అయితే "సోషలిస్టు వ్యవస్థ" ను నిర్మించి పటిష్టం చేసే క్రమంలో "సోషలిస్టు" దేశాలు కొన్నితప్పిదాలను చేస్తున్నాయి. అందులో కొన్ని తీవ్రంగా ఉంటున్నాయ్. అయినా వాటిని "అతిగా" అంచనా వేయకూడదు. తక్కువగానూ అంచనా వేయకూడదు. నేటి పరిస్థితులలో ప్రజాకళాకారులు ఖచ్చితమైన నిబద్ధత కలిగిఉండాలి. అది "సోషలిస్టు" వ్యవస్థ యొక్క తద్వారా మానవ జాతియొక్క ఉన్నతమైన ప్రయోజనాల్ని పరిరక్షించేదిగా ఉండాలి.

నేడు సాహితీ సంస్థల వాదాల్ని పరిశీలించుదాం. "రష్యా" విష

యంలో "రామాయణం" లాంటి "ఫ్యూడల్" గ్రంథాల్ని ఏ విమర్శ లేకుండా కీర్తిస్తున్నాయని ఓ వాదం. చైనా కూడా రామాయణాన్ని అనువదించుకుంటుంది. "ఆవారా"లాంటి రాజ్‌కపూర్ సినిమాలను దిగుమతిచేసుకుంటుందని మరో వాదం. ఇలాంటి చర్యల మూలంగానే ఆయా దేశాలలో "సోషలిజం"లేదనటం "వ్యక్తిగత ఆస్థి పునరుద్ధరించబడిందనటం" దుస్సాహసం అవుతూంది.

రష్యాలో "సాంస్కృతిక విప్లవం" జరగక పోవటం వలన అనేక సంస్కరణవాద ధోరణలు బలపడ్డాయని ఓ వాదం. అలాగే చైనాలో "సాంస్కృతిక విప్లవం" కారణంగా ప్రజలకూ, అభివృద్ధికీ ఆటంకం కలిగిందని మరో వాదం ఉన్నాయ్.

వాస్తవానికి చైనాలోనూ,రష్యాలోనూ అనేక పొరపాట్లు జరిగాయి. "సాంస్కృతిక విప్లవం" కాలంలో జరిగిన పొరపాట్లను ఈ రోజున చైనావారు ఆత్మవిమర్శ చేసుకుంటున్నారు. "66" నుండి "77" వరకు జరిగిన ఘోరమైన తప్పులకు మావాదే పూర్తి బాధ్యత అని చైనా అగ్ర నాయకులు ఈ నడుమ ప్రకటించిన సంగతి మనకు తెలిసిందే. అలాగే సామ్రాజ్యవాదాన్ని ఎదుర్కోవటం వైఫల్యం చెందటం....సంస్కరణ వాద విధానాలను ప్రకటించిన "రష్యా" వాటినుండి బయటపడటం జరుగుతోంది. నేటికీ రష్యా, చైనాలు రెండూ తమ ప్రభుత్వ ప్రయోజనాల నిమిత్తం పెట్టుబడిదారి దేశాలలోని ప్రజలతో సంబంధాలు పెట్టుకోకుండా బూర్జువా భూస్వామ్య పాలకులతో సంబంధాలు పెట్టుకుంటున్నారు. కొన్ని సందర్భాలలో వారికి "కితాబు" లివ్వటంద్వారా ప్రజలపై ఆ "పాలకులు" సాగిస్తున్న దమనకాండను సమర్థిస్తున్నారు.

ప్రపంచవ్యాప్తంగా పెట్టుబడిదారీవిధానం, సామ్రాజ్యవాదం తీవ్రమయిన సంక్షోభంలో పడిపోయింది. దానికి నేడు ప్రపంచ సోషలిస్టు శిబిరంలోని చీలికల్ని వాడుకోవటం, పెంచి పోషించటం మినహా వేరే గత్యంతరం లేదు.

కాబట్టి నేడున్న పరిస్థితులలో ప్రతిరచయిత, కళాకారుడు ఏ దేశం

వెనుక కొట్టుకుపోవాల్సిన పనిలేదు. అలాగే ఏ దేశం యొక్క విధానాలమీద పోరాడటం ప్రధానాంశం కాదు. నేటి చారిత్రిక పరిస్థితులలో ప్రపంచ సోషలిస్టు దేశాల ఐక్యత, ప్రపంచ సోషలిస్టు ఉద్యమ ఐక్యతను ప్రపంచ కార్మికుల ఐక్యతను కోరాలి. అందుకు తన శాయశక్తులా కృషి చేయాలి! తద్వారానే విస్తృతమైన ప్రజా ఐక్యసంఘటనను నిర్మించటానికి వీలుంటుంది. ఖచ్చితమైన సామ్రాజ్యవాద వ్యతిరేక, భూస్వామ్య వ్యతిరేక భావాల్ని ప్రచారం చేయటానికి అవకాశాలుంటాయ్. ఓ ప్రజాతంత్రవాది, ఓ సోషలిస్టు, ఓ ప్రజారచయిత, కళాకారుడు, అభ్యుదయవాది, విప్లవకారుడు నిర్వర్తించే తీరు ఇది.

నేటి సాహితీ, సాంస్కృతిక రంగాన్ని పరిశీలించుకుందాం. ఈనాడు ప్రజాకళలు అభివృద్ధి చెందుతున్న దశలో, బలపడుతోన్న దశలో ఉన్నాయి. (ఎన్ని విభేధాలున్నా). అయితే ఈ పరిస్థితిని గురించి ఎక్కువగా అంచనా వేసుకుంటే పొరపాటు అవుతుంది. నేడు సాహిత్యోద్యమం ఎంత బలపడినా దానికి అనేకరెట్లు ప్రజావ్యతిరేక సాహిత్యం. కళలు రాజ్యమేలుతున్నాయి. ముఖ్యంగా భూస్వామ్య యుగపుభావాలు నూతనరూపాలలో దర్శనమిస్తున్నాయి. పాశ్చాత్య సంస్కృతి, కాల్పానిక సాహిత్యం, సినిమాలు యువతను "స్లో పాయిజన్" చేస్తున్నాయ్. మూఢనమ్మకాలు, తులదృక్పధం పెచ్చుపెరిగిపోతున్నాయ్. బాబాలు.... అమ్మలు సందుకొకరు.... గొందికొకరు పుట్టుకొస్తున్నారు. అనేక రకాల ప్రజావ్యతిరేక ఉద్యమాలు దాడిచేస్తున్నాయ్. ప్రజలలో చైతన్యం అంతంత మాత్రంగానే ఉంది. టన్నులకొద్దీ ఓ ఉద్యమంలా సాగుతున్న ఈ ప్రజా వ్యతిరేక సాహిత్యమూ, కళలనడుమ నేటి సంస్థలూ, వాటి ఆచరణ అనేక పరిమితులలో సాగుతోంది. "సిద్ధాంతాల" పేరుతోచేసుకునే "ధూషణ" కార్యక్రమంతోనే వారికీ సరిపోతుంది. నిజానికి నేడు సామాజికంగా, భయంకరంగా పెరిగిపోయిన కాలదృక్పధం.... అవినీతిని పరికించినపుడు ప్రజాసంస్థలూ, సాహితి, సాంస్కృతీ ఉద్యమం ఎంతటి ప్రాధమిక స్థాయిలో ఉన్నాయో అర్థం అవుతుంది.

ఇలా అనటం నేడు ప్రజారచయితలు, కళాకారులు సాధించిన విజయాల్ని తక్కువగా అంచనా వేయటం ఎంత మాత్రంకాదు. ఓ ప్రజల మనిషి తనలోని బలంతోపాటు బలహీనతల్ని, లోపాల్ని నిష్పక్షపాతంగా అంచనా వేసుకోవాలి.

ఇంకో విషయం ఏమిటంటే ఈ సంస్థలలో పనిచేసే అనేకమంది సభ్యులకు ఆ ప్రణాళికమీద నమ్మకం లేదని, 'కీర్తి కాంక్ష' కోసమే ఈ సంస్థల్ని అంటి పెట్టుకున్నారని 'జనసాహితీతో మా విభేధాలు'లో రంగనాయకమ్మ రాస్తారు. దీన్ని పూర్తిగా తీసివేయటానికి వీలుకాలేదు. అలాగే అదే పుస్తకంలో "జ్వాలాముఖి" "నిఖిలేశ్వర్" 'రష్యాను' "సామ్రాజ్యవాదం"గా వాడటానికి, వియత్నాం చైనాపై దాడి చేసిందనటానికి సుముఖతను వ్యక్తం చేయకపోవటాన్ని ఆమె రాస్తారు. "రష్యా" విషయాలు ఇటీవల "శ్రీశ్రీ" అభిప్రాయాలు చూశాం. ఈ రకంగా రష్యా చైనాల్ని "సోషలిస్టు" దేశాలుగా గుర్తించే అనేకమంది అన్ని సంస్థల్లోనూ ఉన్నారు. కానీ వారు బయటపడలేకపోతున్నారు. "సోషలిస్టు" వ్యవస్థను ప్రేమించే వాంఛించే అనేకమంది ఈ సంస్థల్లో ఉంటున్నారు. అనేక కారణాలతో వారు తమకు ఇష్టంలేని అభిప్రాయాల్ని కొనసాగిస్తున్నారు.

చివరిగా ఓ విషయం చెప్పాలి. "కమ్యూనిస్టు" దేశాలు, పార్టీన్యా ఎటువంటి తప్పులు చేసినా మార్క్సిజం-లెనినిజం, ప్రజల పోరాటాలు, విమర్శ-ఆత్మవిమర్శ వారిని సరిదిద్దుతాయనే ప్రాధమిక అవగాహనతో సాగిపోదాం.

దేశంలో నేడున్న పదులకొద్దీ గ్రూపులు, చివరకు వ్యక్తుల పేరున కూడా ఏర్పడి, చివరకు కిరాయి గూండాల్లా ప్రవర్తించే తీరునుండి బయటకు రావాలి. రాజకీయాలనడుమ ఉంటున్నామనే వాదంతో గ్రూపు రాజకీయాల్ని సాహితీ సాంస్కృతిక రంగంలో కొనసాగించే, అంతర్జాతీయ రాజకీయాలనే ప్రధానంగా తీసుకునే వైఖరిని విడనాడాలి.

10)

సాహితీ సాంస్కృతిక ఉద్యమ పరిమితుల్ని దృష్టిలో ఉంచుకోవాలి. నేడున్నదశలో భూస్వామ్య వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేఖ చైతన్యం కలిగించటమే లక్ష్యంగా ఉండాలికాని విప్లవం ఏ రకంగా వస్తుందో చెప్పే పార్టీ కార్యక్రమం తీసుకోకూడదు. విప్లవం ఏ రకంగా రాగలదో ప్రజాకళాకారులకు ఓ అంచనా ఉండటం వేరు. కానీ సాహిత్య ఉద్యమంతో ఆ భావాల్ని కలగాపులగం చేయరాదు.

ప్రజలకి 'విప్లవం' ద్వారానే తమ సమస్యలు పరిష్కరించబడతాయనే చైతన్యం కలిగించటమే ప్రధానకర్తవ్యం. విప్లవ దశకు పరిపక్వం చెందినపుడు పరిస్థితులు మారినపుడు తప్పని సరిగా సాహితీ, సాంస్కృతిక సంస్థల కార్యక్రమాలు ఆ పరిస్థితులకు తగినట్లుగానే ఉంటాయ్. అంతదాకా భారతదేశంలో విప్లవ పరిస్థితుల పట్లగాక, భూస్వామ్య వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక దృక్పథాన్ని ప్రచారం చేయాలి. 'సోషలిస్టు' దేశాలనడుమ వచ్చే సమస్యల్ని 'ఐక్యత' ప్రాతిపదికపై చూడాలి. మనం తీసుకొనే వైఖరి "సామ్రాజ్యవాదానికి" అనుకూలంగా ఉండకూడదు. అలాగే ప్రజాసంస్థలనడుమ వచ్చే అభిప్రాయబేధాల్ని స్నేహపూర్వకంగా పరిష్కరించుకోవాలి.

విచారించదగ్గ విషయం ఏమిటంటే నేడు 'కమ్యూనిస్టు'ల్లో ఎన్ని గ్రూపులున్నాయో అన్నిగ్రూపులుగా నేడు సాహితీ, సాంస్కృతిక ఉద్యమం చీలిపోయింది. వి.ర.సం. జనసాహితీ, అ.ర.సం. లేకోకుండా ఇంకా అనేక సంస్థలు ఏర్పడి అయా పరిమితుల్లా పనిచేస్తున్నాయ్.

మొత్తంగా ఈ సంస్థలు "విశాల ఐక్యసంఘటనను" నిర్మించే కర్తవ్యంతో విఫలం అయ్యాయి. అందుకు అనుకున్నట్లు ప్రపంచ రాజకీయాలు. దేశీయంగా కమ్యూనిస్టుపార్టీలూ గ్రూపులు ఇందుకు కారణం కాగా నేడు సాహితీ, సాంస్కృతిక సంస్థలు ప్రపంచ సోషలిస్టు ఉద్యమ విబేధాలేవైనా, దేశంలో గ్రూపులుల, రాజకీయ, సిద్ధాంత సమస్యలేవయినా వాటికి అతీతంగా తాము ప్రకటించుకొన్న దృక్పథాన్ని

పెంపొందించటానికి, అలాగే మార్క్సిస్టుగా కాని అభ్యుదయ రచయితల్ని' కళాకారుల్ని ఐక్యపరిచి వారిని ఉన్నతపరిచే కర్తవ్యాన్ని చేపట్టాలి, ఈ రకంగా దేశంలోని అభ్యుదయ శక్తులన్నింటిని 'సాహితీ సాంస్కృతిక' రంగంలోకి ఆకర్షించి విశాలమైన ఐక్య సంఘటనను నిర్మించాలి.

చివరిగా..........

భూస్వామ్య వ్యతిరేఖ, సామ్రాజ్యవాద వ్యతిరేఖ భావ జాలాన్ని ప్రచారం చేయటంతోనే రచయితల, కళాకారుల కర్తవ్యం తీరిపోదు. వాటికి ప్రత్యామ్నాయంగా పీడిత ప్రజల ఆశాజ్యోతిగా నిలబడే 'సోషలిస్టు వ్యవస్థ' యొక్క విజయాల్ని గణనీయంగా ప్రచారంచెయ్యాల్సి ఉంటుంది! ఆ వ్యవస్థలు ప్రజలూ రచయితలు, కళాకారులు సాధిస్తున్న విజయాల్ని, అక్కడి సామాజిక స్థితిగతుల్ని, పెట్టుబడిదారి దేశాల్లోని సంక్షోభాన్ని, ప్రచారం చేయాలి. ఆ విధంగా 'జనతా ప్రజాస్వామికాన్ని' నిర్మించు కోవటానికి తగ్గ స్పందనను ప్రజల్లో ఆవిష్కరించటానికి తీవ్రంగా కృషిచేయాలి.

నేడును చరిత్ర పరిస్థితుల్లో ప్రజాకళాకారుల రచయితల, సంస్థల ప్రధాన కర్తవ్యం ఇదే........

: — :

# మంచిముత్యాలు
# శ్రీ అల్లం శేషగిరిరావు కథలు
### - డా॥ అత్తలూరి నరసింహారావు

---

## మృగతృష్ణ :

మనకు ప్రేమ కథలున్నాయి, నీతికథలున్నాయి, మధ్యతరగతి కథలున్నాయి, మందు కథలున్నాయి, విరహం కథలున్నాయి, విప్లవ కథలున్నాయి, సెక్సు కథలున్నాయి, డిటెక్టివ్ కథలున్నాయి, రచయిత కథలున్నాయి, రాజకీయ కథలున్నాయి, పరమోత్కృష్టమైన కథలున్నాయి, పరమ పాకీ కథలున్నాయి - కాని ఇలాంటి వన్నీ ఎన్ని వున్నా వేటని నేపధ్యంగా పెట్టుకుని రాసిన మానవ జీవిత కథలు మాత్రం మనకు లేవనే చెప్పాలి. ఈ లోపాన్ని అల్లం శేషగిరిరావుగారు విజయవంతంగా కాకపోయినా వినయవంతంగానైనా పూరించారనే చెప్పాలి.

మృగతృష్ణ : - ఈ కథలో బైరిగాడు ప్రధాన పాత్ర ధారి. అతనికి ఒక మెరకచెక్క వుంది. అది మూడు సంవత్సరాలనుంచి నీళ్లు లేక బీడుగానే వుండిపోయింది. దాని మీద కోమటి సూరయ్య దగ్గర అప్పుచేస్తాడు. అప్పు వడ్డీతో కలుపుకుని మూడువందలు దాకా అయింది. అప్పు తీర్చకపోతే మెరక చెక్క సూరయ్య చేతిలోకి వెళ్లిపోతుంది. ఇలాంటి పరిస్థితిలో ఏదన్నా జంతువు దొరికితే తన అప్పు మొత్తం కాకపోయినా కొంతయినా తీరిపోతుందిగదా అనుకుని బైరిగాడు నాటు తుపాకి తీసుకుని అడివికి

బయలుదేరతాడు. అరవై ఏళ్ల బైరిగాడు తెప్పల్ని, డొంకల్ని, రాళ్ళని, కొండల్ని దాటుకుంటూ సాయంత్రానికల్లా అడివిలోని నీటిమాటుదగ్గరకు వస్తాడు. అన్నీ సిద్ధంచేసుకుని పొంచి కూర్చుని వుంటాడు. చివరికి అర్ధరాత్రి దాటిన తర్వాత ఒక దుప్పిని కొట్టగలిగాడు. దాన్ని అతికష్టం మీద భుజాన వేసుకుని బయలుదేసతాడు. ఒక పక్క చినుకులు. అయినా బాకీ తీరుతుందనే ఆశతో తుప్పల్ని, రాళ్ళనీ లెక్క చెయ్యకుండాన డుస్తూనే వున్నాడు. మధ్యలో రేచుపక్కల బారినుండి తప్పించుకుంటాడు. ఓండ్రిపోతు దుప్పి కారణంగా, మళ్లీ నడక ప్రారంభించి గెడ్డ దగ్గరకు వస్తాడు. వర్షానికి గెడ్డ నిండుగా ప్రవహిస్తోంది. గెడ్డ దాటకపోతే చుట్టువారి చాలా ప్రయాస. అతను గెడ్డ దాటటానికే నిర్ణయించుకుని దుప్పిని ఒడ్డున దించాడు. కాళ్లు చేతులు రుద్దుకున్నాడు. తుపాకి అవతలి వేపుకి గిరాటేశాడు. దుప్పిని భుజాన వేసుకుని నీళ్లలోకిదిగాడు. మధ్య గోతిలో కాలువెయ్యటంవల్ల పట్టుతప్పిపోయి దుప్పి పడిపోయింది. చివరికి గెడ్డ వెడల్పు ఎక్కువున్నచోట మొత్తం మీద దుప్పితో సహా గెడ్డనుంచి బయట పడ్డాడు. అవతలి ఒడ్డునవున్న తుపాకీని అందుకున్నాడు. దుప్పిని భుజాన వేసుకుని తెల్లారేసరికి గుడిసె చేరుకున్నాడు. దాంతో బైరిగాడి వొళ్లు హూణం అయిపోయింది. అయినా బ్రతుకు మీది ఆశతో, ఆలోచనలో వుండగా ఫారెస్టుగార్డు ఎదురుగా ప్రత్యక్షం. బైరిగాడికి నోట మాటరాలేదు. తుపాకీ లైసెన్సు లేనందుకు, జంతువుని కొట్టినందుకు కేసు పెడతానని గార్డు బెదిరిస్తాడు. బైరిగాడు కాళ్లా వేళ్లా పడతాడు. ఇంతలో కోమటి సూరయ్య వచ్చి ఇద్దరిమధ్య రాజీచేస్తాడు. కేసులేకుండా చెయ్యటానికి వంద రూపాయలు సూరయ్యే ఇచ్చి, బైరిగాడిచేత పత్రిం రాయించుకుని, దుప్పిని రేంజరు ఇంటికి తరలించటానికి నిర్ణయిస్తాడు. బైరిగాడు ఇక తన మెరక చెక్క మీద ఆశలు వదులుకున్నాడు. కోపంతో తుపాకి తీశాడు. అడివిలోకి వెళ్లిపోయాడు. ఈసారి జంతువుల వేటకికాదు - అన్యాయం మీద వేటకి, అలా వెళ్ళిన బైరిగాడు కొండల్లో నుంచి తిరిగి రాలేదు.

ఈ కథలో అడివి వాతావరణం బైరిగాడి మనస్తత్వం చిత్రిణ అత్యంత సహజంగా వుండి చివరికి కథ ముగింపు అసహజంగా వున్నట్టు అనిపిస్తుంది. బైరిగాడు కోపంతో, కసితో అడివిలోకి వెళ్లినట్టు వుంది. అడివిలోకి వెళ్ళటానికిగల కారణం కనిపించినంత స్పష్టంగా, దానికి కావల్సిన చైతన్యం, మానసిక వాతావరణం బైరిగాడికున్నట్టు కథలో ఎక్కడా లేదు. ఈ కథ '75 లో ప్రచురణ అయింది కాబట్టి అంతకు ముందున్న విప్లవ రాజకీయ, సాహిత్య ప్రభావాలు ఈ కథమీద వున్నట్టు కనిపిస్తోంది.

బైరిగాడు నిస్సహాయస్థితి, సూరయ్య పాపంలా వెరిగిపోవటం గార్డు బెదిరింపు, లంచం లాగటం - ఇలాంటి శ్రీకాకుళ గిరిజన ఉద్యమ బీజాలు నేపథ్యంగా వున్నాయి ఈ కథలో.

వటుడు :- ఈ కథలో రిటైరయిన దశరధరామయ్యగారు అకౌంటెంట్‌గా దర్శనమిస్తారు. పూర్వం మిలటీరిలో పనిచేసిన చిన్నయ్య జీపు డ్రైవరుగా వుంటూ వుంటాడు. రామారావు అసిస్టెంటు ఇంజినీరుగా వుంటాడు. ఇంకా దశరధరామయ్యగారి భార్య, కూతురు, కొందరు ఉద్యోగస్తుల భార్యలు, జిల్లా ఇంజినీరు మొదలైన వాళ్ళు కూడా వుంటారు.

వీళ్లందరూ అడవిలో కొత్తగా రైల్వేలైను వేస్తుండే దగ్గర్లోనే టెంట్లు వేసుకుని వుంటారు.

దశరధరామయ్య రాత్రింబగళ్ళు పనిచేసే మధ్య తరగతి సంసార జీవి. రిటైరయిన తర్వాత తాత్కాలికంగా బతుకు తెరువుకోసం ఈ ఉద్యోగంలో ప్రవేశించాడు. బ్రతుకు భయం చుట్టుకున్న వాడు. ఇంట్లో భార్య, పురిటికి ఇంటికివచ్చిన కూతురు వున్నారు.

చిన్నయ్య మిలటరీలో పనిచేసి ఇక్కడ డ్రైవరుగా పనిచేస్తున్న వ్యక్తి. చాలా కలుపుగోలుతనం వున్న వ్యక్తి. మిలటరీ డిసిప్లిను, అన్యాయంపట్ల ఆక్రోశం, ఆపదొస్తే సహాయపడే స్వభావం వున్న వ్యక్తి.

ఆ రోజు రాత్రి ఇంకా దశరథరామయ్యగారు ఆఫీసులో పనిచేసు కుంటూనే వున్నారు. చిన్నయ్య మేలుకుని వుండటంచూసి ఆయన భార్య పలకరిస్తుంది. ఏదో కష్టసుఖాలు మాట్లాడుకుంటూ వుంటారు. ఇంతలో పెద్దపులి శబ్దం వినిపిస్తుంది. తర్వాత వఱడు శబ్దం వినిపిస్తుంది. వఱడు గురించి తెలియని దశరథరామయ్యగారి భార్యకు అది ముసలిసక్కని, మాయదారిదని, పులివెంట తిరుగుతూ అది తినగా మిగిలింది తింటూ, బ్రతు కుతూ వుంటుందని దాని జీవనస్వభావం గురించి చిన్నయ్య చెబుతాడు. ఆ తర్వాత ఎవరి టెంటులో వాళ్ళు నిద్రపోవటానికి వెళ్ళిపోతారు. తెల్లవారుతుండగా దశరథరామయ్యగారి కూతురికి నొప్పులు వస్తాయి. టెంటులోని వారందరూ లేస్తారు. చిన్నయ్యవెళ్ళి ఇంజనీరుగార్ని అడిగి జీపు తీసుకొచ్చి పట్నం తీసుకెళ్తాడు. దశరథరామయ్య, భార్య కూతురితో వెళ్ళారు.

రాత్రి ఇబ్బంది కారణంగా మరసటిరోజు సిద్ధంగా వుంచాల్సిన కాగి తాల్ని దశరథరామయ్యగారు వుంచలేకపోయారు. ఇంజనీరు రామారావు అనవసరంగా మాటలు జారతాడు. దశరథరామయ్యగారు తన పరిస్థితిని విన్నవించుకున్నా వినిపించుకోకుండా ఉద్యోగంనుంచి తీసేస్తున్నాను పొమ్మంటాడు. ఇదంతా గమనిస్తున్న చిన్నయ్య కలగజేసుకుంటాడు. ఇంజి నీరు మరీ ఉద్రిక్తుడవుతాడు. దాంతో చిన్నయ్య ఉద్యోగం ఊడబెరకమని జిల్లా ఇంజనీరుకి కాగితం పంపిస్తాడు. తర్వాత ఉద్రేకం తగ్గిన తర్వాత పునరాలోచించుకుని ఇంజనీరు చిన్నయ్యతో రాజీకి వస్తాడు.

ఒకరోజు జిల్లా ఇంజనీరు కేంపుకొచ్చాడు. ఇంజనీరుచేసిన మేరకు జిల్లా ఇంజనీరు దశరథరామయ్యగార్కి మరో సంవత్సరందాకా ఇస్తున్నట్టు చెప్పారు. తర్వాత చిన్నయ్యని పిలిపించి ఉద్యోగంలోంచి అవిధేయత కార ణంగా తీసేస్తున్నట్టు చెప్పాడు. ఇంజనీరు రామారావు తనురాసిన ఉత్త రాన్ని మరచిపోయినట్టు, దాన్ని ఉపసంహరించుకున్నట్టు చెప్పినా జిల్లా ఇంజనీరు వినలేదు. ఈ విషయంలో దశరథరామయ్యగార్ని అడిగితే

ఆయన చిన్నయ్య పక్షంమాట్లాడకుండా దొరలపక్షం మాట్లాడతాడు. రామారావు ఎంతచెప్పినా వినకుండా జిల్లా ఇంజినీరు చిన్నయ్య ఉద్యోగం తీసేశాడు.

చిన్నయ్య అన్నీ సర్దేసుకుని, తాళాలు ఇచ్చేసి ఇంజినీరు రామారావుకి సెల్యూట్ చేశాడు. రామారావు తలదించేసుకున్నాడు. ఆ కాంపులోని వాళ్ళందరికీ నవ్వుతూ వీడ్కోలు చెప్పాడు. అందరూ చిన్నయ్య మంచితనాన్ని పొగిడేవారే. దశరథరామయ్యగారి భార్య చిన్నయ్యని ఆ రాత్రికి వుండి వెళ్ళమంటే లేదు వెళ్తానని బయలుదేరుతూ ఇంట్లోవున్న పసిగుడ్డును పలకరించి వెళ్తాడు. చిన్నయ్య కాంపుదాటగానే పులి కనిపించినా నడకసాగించాడు. తర్వాత వఱడు కనిపిస్తే ఆగిపోయి మళ్ళీ నడక ప్రారంభించి కనుమరుగయ్యాడు.

ఇంత జరుగుతున్నా వఱడులాంటి దశరథరామయ్య ఆ చుట్టుపట్ల లేకుండా, అర్ధరాత్రి దాటిన తర్వాత ఇంటికి చేరాడు.

మధ్యతరగతి స్వభావాన్ని వఱడుతో పోల్చిచెప్పటమే ఈ కథ ప్రధాన ఉద్దేశ్యం. ఏదన్నా సమస్య వచ్చినపుడు మధ్యతరగతి ఉన్నతవర్గం కొమ్ము కాస్తుందేగాని క్రిందవర్గం కొమ్ము కోయదనేది సాధారణ సత్యం. ఇక్కడ తన కొమ్ముకాసిన కింది వర్గానికి ద్రోహంచేసి పై వర్గంలో కలిసిన మధ్యతరగతి స్వభావాన్ని చిత్రించటంలో రచయిత వర్గదృష్టి సమంగానే వుంది. మధ్యతరగతి స్వభావాన్ని సింబాలిక్ నగ్నంగా చెప్పిన కథ కథ కట్టినతీరు అంత బలంగా లేదనిపిస్తుంది.

## ది డెత్ ఆఫ్ ఎ వేసిటర్ -

మనుషుల్ని చంపుతున్న పులిని చంపుదామని పులిలాంటి కనకరాజు కొడుకు చిట్టిబాబు, మిత్రుడు కేశవరావు, నౌకరు రాములు వచ్చి దగ్గరలోనే వున్న బంగళాలో మకాం చేస్తారు. పదిరోజుల్నుంచి ప్రయత్నం చేస్తున్నా ఆ పులి దొరకటంలేదు. ఆ రాత్రికూడా కనకరాజు, చిట్టిబాబు మాటులో

వుండగా పులి కనిపించి మాయమైందేగాని దెబ్బకి దొరకలేదు. చివరికి తెల్ల వారింది. బంగళాకు చేరారు. కనకరాజులో పట్టుదల పెరిగింది. దాన్ని చంపితే వచ్చే కీర్తికోసం కనకరాజు ఎదురుచూస్తున్నాడు. వెంటనే పగలు పులి ఆచూకీ లాగటానికి బయలుదేరాడు. దానిగురించి వాకబుచేశాడు. కాలి గుర్తులు చూశాడు. చివరికి ఆ పులి రాత్రి తనుంటున్న బంగళా చుట్టూ తిరిగివెళ్ళినట్టు కాలిగుర్తులు సాక్ష్యం ఇస్తున్నాయి. ఒక నిర్ణయానికి వచ్చాడు. ఆ రాత్రికి కనకరాజూ, మిత్రుడు కేశవరావూ మాటుకి వెళ్ళారు. ఆ రాత్రి పది దాటింతర్వాత దగ్గరలోనే వున్న బంగళానుంచి రాములు లాంతరు పుచ్చుకుని కాఫీ తెస్తున్నాడు కనకరాజుకోసం, దానిలోవున్న కుట్ర మిత్రుడు కేశవరావుకి తెలిసిపోయి బెంబేలుపడిపోయాడు. న్యాయం కాదన్నాడు. కీర్తికలల్లో వూరేగుతున్న కనకరాజు ఈ మాటలు వినిపించు కోలేదు. ఈలోపు రాముల్ని పులి ఈడ్చుకుపోయింది. మాటుదిగి మిత్రుడ్ని బంగళాకి పంపేసి పులి జాడలకోసం అడవిలోకి వెళ్ళిపోయాడు తన తుపాకీతో. తిరిగి తిరిగి చివరకి శవాన్ని గుర్తించగలిగాడు. అది వికృతంగా గుర్తుపట్టలేనంతగా వుంది. ఈలోపు పులి రావటం, తను తుపాకి కాల్చటం అది తన మీదకు పడటం జరిగింది. పులి దవడ చీలిపోయింది. కనకరాజు పులిపంజా రుచి తిన్నాడు. ఆ చంపులాటలో పులీ, కనకరాజూ చచ్చే స్థితి లోకి వచ్చారు. గెడ్డలో పడిపోయిన పులి పారిపోయింది. గెడ్డలో పడ బోయిన కనకరాజు గడ్డిదుబ్బు ఆసరాగా బయటపడ్డాడు. శవంలాంటి తన శరీరాన్ని ఈడ్చుకుంటూ కనకరాజు వస్తూంటే సగం తినేసిన శవం కని పించి ఆగిపోయి పరీక్షగా చూశాడు. ఆ శవం తన కొడుకు చిట్టిబాబుదని తెలుసుకుని పిచ్చిగా, వెర్రిగా అడవిలో పరుగెత్తి పరుగెత్తి కూలి పోయాడు. వెతుక్కుంటూ వచ్చిన కేశవరావుకి, రాములుకితండ్రీకొడుకుల శవాలు కనిపించాయి.

"బాబూ........నన్ను క్షమించు. నేను బయలుదేరినా బాగుండిపోను

నామాట కొట్టేసి చిట్టిబాబు బయలుదేరిపోయారు." అంటూ రాములు ఏడుస్తాడు.

"ది డెత్ ఆఫ్ ఎ మేనిటరీ" అని కేశవరావు డైరిలో రాసుకుంటాడు.

మనుషుల్ని తింటున్న పులిని చంపుదామని బయలుదేరి, స్వార్థం కీర్తి కాంక్ష వెంటబడగా, తానే మేనీటర్‌గా ప్రవర్తించి కొడుకుతోసహా బలైపోయిన కనకరాజు విషాద వికృతమూర్తిగా కనపిస్తాడు. కథలో అనూహ్యమైన చివరి మలుపుతో మనసు గతుక్కుమంది. మనలోని మేనిటర్ ప్రవృత్తి కూడా క్షీణం అవుతుంది. కనకరాజు క్రౌర్యం కనీ కనిపించకుండా మనల్ని వెంటాడుతుంది. రాములు అమాయకత్వం, చిట్టిబాబు బలైపోవటం చూసి జాలివేస్తుంది. కేశవరావు హృదయభాష వినపడి విలవిల్లాడిపోతాం.

## జాతికుక్క

రంగారావు సరోజలకు ఒక్కడే కొడుకు రాజా. రంగారావు ఏం చేస్తుంటాడో తెలియదు కాని డబ్బున్న మనిషని అర్థం అవుతుంది. పేదల్ని, వాళ్ళ గుడిసెల్ని అసహ్యించుకునే మనిషిగా కనిపిస్తాడు. కొడుకు రాజా ఊరకుక్క నొకదాన్ని తీసుకొచ్చి పెంచుతూ వుంటాడు. జాతికుక్కలమీద విశ్వాసంవున్న రంగారావు ఆ ఊరకుక్కని చూసి చీదరించుకుంటాడు. చెబితే వినడు. దీంతో నానారకాల హైక్లాసు అవస్థలన్నీ మానసికంగా పడుతున్నాడు. రాజామాత్రం ఆఊరకుక్కతో తిరుగుతూ కౌబాయ్ సాహసాల్ని కలలు కంటున్నాడు. జాతికుక్కల మీదికి తన ఊరకుక్కని వదలి చిత్తు చేయించాలని ఆశ పడుతున్నాడు. ఆరోజు బీచిలో తన కుక్కతో ఫీట్లు చేయించాడు. బంతిని సముద్రంలో విసరి కుక్కతో తెప్పించాడు.

ఈ ఆటలో ఒకసారి విసిరిన బంతి సముద్రంలోకి దూరంగా వెళ్ళింది. కుక్క బంతికోసం వెళ్ళి తిరిగి రాలేదు. రాజా జాకీని వెతకటం కోసం ఒడ్డు మొత్తం గాలించేస్తున్నాడు. మరొకపక్క చీకటి పడుతోంది. ఇంటి దగ్గర కంగారుపడి రాజాకోసం రంగారావు బయలుదేరాడు. జాకీని చివ రికి పోగొట్టుకున్న రాజాదుఃఖంతో ఇంటికి చేరాడు. జాకీపోయినందుకు రంగారావు సంతోషించాడు. జాతికుక్కని కొనిస్తానని తండ్రి అంటాడు. జాకీయే కావాలని, మీరంతా దాన్ని చంపేశారని అరుస్తూ ఆ కోపంలో గోడకివున్న అద్దాన్ని పగలకొడతాడు. తండ్రి అహం సంతృప్తి పడు తుంది. కొడుకు తన రక్తంలోని వాడేనని అర్థం అయ్యేసరికి.

ఈ కథ మొదటిసారి చదివితే కథకుడు ఏం చెప్పదల్చుకున్నాడో స్పష్టంగా బోధపడదు. మళ్ళీ లోతుగా చదివితే - ఊరకుక్కతో తిరు గుతున్న తన కొడుకు తన స్థాయికి దిగుతున్నాడేమోనని మధనపడ్తాడు. తండ్రి. జాతికుక్కతో తిరగాల్సినవాడు ఊరకుక్కతో తిరగటమేమిటని కుంగిపోయాడు. చివరి సంఘటనతో తన కొడుకు తత్త్వం, స్వభావం మాత్రం తన అంతస్థువేనని, తనను మించికూడా పోగలడనే సంతృప్తి రంగారావు పొందాడు. ఉన్నత వర్గాలవాళ్ళు కొన్ని కారణాలవల్ల ఎప్పు డన్నా తక్కువ వర్గాలవాళ్ళతో తిరిగినా వారి జీవస్వభావం మాత్రం వారు పుట్టిన వర్గంలోనే పాదుకునివుంటుందని చెప్పిన కథ.

ఊరకుక్క గురించి కొడుకు చెప్పేకబుర్లు రంగారావుతో భార్య చెబితే అప్పుడు రంగారావుకి "మెడమీద గుప్పెడు గొంగళి పురుగులు పాకుతున్నట్టయింది." అనటంలో రంగారావు వర్గస్వభావం. కిందివర్గాల మీదవుండే అలహ్యాం. జుగుప్స తెలుస్తుంది.

# పులిచెరువులో పిట్టల వేట-

తండ్రి కుక్కల జమీందారుగా పేరుపొంది చనిపోయాడు. ఒకరోజు కుక్క కరవటం వల్ల కొడుకు కుక్కలద్వేషిగా మారిపోయాడు. ఆ కొడుకు పేరు రఘునాధరావు భార్యపేరు సరోజిని. రఘునాధరావు కాస్త తిక్క మనిషి. తనకి కూతురు పుడితే ఎవరెన్ని చెప్పినా వినకుండా "మేరీ" అని పేరు పెట్టాడు. కొంతకాలానికి భార్య పోయింది. కూతురు పెరిగి పెద్దదయింది. తనకి ముసలితనం వచ్చేస్తూవుంది, కూతుర్ని మేనల్లుడికిచ్చి, పెళ్ళి చేద్దామనుకుంటూ వుంటాడు. ఈ లోపు కూతురికి కుక్కని పెంచుకోవాలనే కోరిక కలుగుతుంది. ఎంత చెప్పినా వినక పోయేసరికి రఘునాధరావు సరే కుక్కని తెప్పిస్తాడు. కుక్క నామకరణమహోత్సవానికి మేనల్లుడ్ని, తన మిత్రుడు శామ్యూల్‌ని పిలిపించి "విస్కీ" అనేపేరు పెడతాడు. ఆ సందర్భంగా విందు- తర్వాత పులిచెరువులో పిట్టలవేట. చెరువులో వేట సరంజామాతో మేనల్లుడు ఆనంద్‌బాబు, కూతురు ఒక పడవలో ఒక దిక్కుకి తనూ, తన మిత్రుడు శామ్యూల్ మరో పడవలో మరో దిక్కుకి బాతుల వేటకి బయలుదేరతారు. మేరీఆనంద్‌లు వలపు వేటతోబాటు పిట్టలవేటలో కూడా వుండి కొన్నిటిని కాలుస్తారు. గూడ బాతుల జంటని కాల్చితే ఒకటి పడిపోవడంవల్ల రెండోది విషాదంగా అరుస్తూ వీళ్ళున్నచోటనే తిరుగుతోంది. ఆ దృశ్యం చూసి వీళ్ళిద్దరూ చలించిపోతారు. మరోదిక్కున రఘునాధరావు శామ్యూల్ తుపాకిమోతలు వీళ్ళకు వినిపిస్తూనే వున్నాయి. ఇంతలో సూర్యుడు దిగిపోతున్నాడు. చివరిసారిగా చెరువు అవతల వున్న బురదనేలలో నత్తగోట్లుని మేరీ కాల్చింది. ఆనంద్ వాటిని ఏరుకు రావటానికి వెళ్ళి ఆ బురదలో వున్న వూబిలో దిగబడిపోతాడు. మేరీ విలవిలలాడిపోతూ వుంటుంది. రఘునాధరావు. శామ్యూల్ కేక వినిపించనంత దూరంలో వుంటారు. ఆ వూబిలో అలా దిగబడిపోతూ ఆనంద్ తనని

కాల్చివెయ్యమని మేరీని కోరతాడు. మేరీ కోరిక తీర్చలేదు. ఆనంద్ చివరికి పూర్తిగా ఊబిలో కూరుకుపోతాడు. నిస్సహాయ మనస్థితిలో మేరీ వుండగా, జంటపోయిన ఒంటిబాతు విషాదంగా అరుస్తూ పైన తిరుగుతోంది.

వేటమీద విరక్తి తెరవేయించే కథ. మన ఆనందం కోసం జంతువుల్ని, పిట్టల్ని వేటాడి, హింసించి, కొన్నిటికి ఎడబాటు కలిగించటం వల్ల వాటి వుసురు మనుషులమీద వుంటుందా అన్నట్టు చిత్రించి హృదయాన్ని కదిలించిన కథ ఇది. ఆ పడుచు జంట పడవదిగిన తర్వాత కొంతకాలానికి వివాహమాడి యవ్వనపు రుచుల్ని అనుభవించటానికి కలలు కంటూ వుంటే మృత్యు ఊబి కలల్ని మాయంచేసి గాయం చేసింది. ఆ గాయం ఒక్క మేరీకేగాదు. రఘునాధరావుకేగాదు. శామ్యూల్ కేగాదు. హృదయమున్న ప్రతివాడికీ, ప్రతి పిట్టకీ అప్పుడే నిత్య వసంతంలోకి అడుగిడబోతున్న వారి జీవితం అలా అర్ధాంతరంగా చీలిపోవటం చూసి చలించిపోతాం.

## అశ్వమేధం

రాజారావు ఇంట్లో యముడు లాంటివాడు. బైట ఆఫీసరు. ఆరోజు ఆఫీసునుంచి త్వరగా ఇంటికి వచ్చేసి ఆడ ఆకలితో ఆత్రంగా ఎదురు చూస్తూ వుంటాడు. ఇంట్లో భార్య పుట్టింటికెళ్ళి వారంరోజులయింది. ఇంతలో ఉద్యోగం కావల్సిన సరళని రాజారావు ప్యూను అప్పన్న తీసుకువచ్చి దిగబెట్టి వెళ్తాడు, రాజారావు వివరాలు అడిగి, మంచి మాటలుచెప్పి మరుసటిరోజే ఉద్యోగం ఇస్తున్నానని సరళని మాపేస్తాడు. మరుసటిరోజు రాజారావు ఆఫీసులో వుండగా మంత్రిగారు ఫోనుచేసి, బెదిరించి ఆ వుద్యోగం తన మనిషికి ఇవ్వమని చెబుతాడు, రాజారావు ఆ అమ్మాయిని పిలిచి ప్రస్తుతానికి ఖాళీలు లేవు. ఈసారివస్తే తప్పకుండా ఇస్తాను అని

చెపుతాడు. సరళ పిచ్చెక్కిపోయి రాజారావుతో దెబ్బలాటకిదిగి పేపర్ వెయిట్‌తో గాయం చేస్తుంది. ఆఫీసువాళ్ళు వచ్చి విడిపించి సరళని పంపేస్తారు. తర్వాత సరళ తండ్రీ చనిపోతాడు. ఆ తర్వాత సరళ సానివృత్తిలోకి దిగిపోతుంది.

ఈ కథలోని ఇతివృత్తం పాతదే అయినా ముగింపు కొత్తగా వుంది. అప్పన్న అనుకుంటున్నట్టు ఈరోజుల్లో ఒళ్లు అమ్ముకున్నా ఉద్యోగాలు దొరకడంలేదు అనేది ఈ కథలోని సారాంశం. సరళ దీన పరిస్థితి, మూగవేదన, నిస్సహాయతనుంచి వచ్చిన క్రోధం ఈ సమాజానికి ప్రశ్నార్ధకాలుగా నిలిచిపోతాయి.

రాజారావు బలవంతపు కవుగిలిలో సరళ ఉన్నంతసేపూ మళ్ళీ తలుపులు తెరుచుకునేవరకూ రచయిత స్థాయినిబట్టి రకరకాలుగా పేజీలు నింపటానికి అవకాశం వుంది. శేషగిరిరావుగారు అచ్చులో అయిదే లైనులు రాశారు. "గాజుతొట్టెలో బిస్కెత్తుముక్క పడీ పడ్డంతో ఆకలిగా అవురావురుమంటున్న "రిగ్గీ" ఒక్కఊపున వెళ్ళి ఎటాక్ ఇచ్చింది. ఛట్ ఛట్ ఛట్ మని ఎగురెగుర్తూ దాన్ని ముక్కుతో పొడిచి చిందర వందర చేసేస్తోంది. బిస్కెత్తుముక్కని నీటిలో తనివితీరా ఆడిస్తూ చప్పరిస్తోంది. కసితీరా కొరికేస్తోంది మింగేస్తోంది."

ఇలా గదిలో జరుగుతున్న సెక్స్‌కాండని ధ్వనింపిస్తూ రచయితకి సిగ్గు వుండాలని నిరూపించాడు.

ఇటు తండ్రిని జబ్బు పీక్కు తింటూంటే, సరళని తండ్రి పీక్కు తింటాడు. అటు మంత్రిగారు ఆఫీసర్ని పీక్కుతుంటే, ఆఫీసరు సరళని పీక్కుతింటాడు. కేంద్ర బిందువు సరళ. ఈ మానవవేటలో పడిపోయిన ప్రాణి సరళ.

# నరమేధం.

ఆ ఊళ్ళో పెత్తందార్లు గంగరాజు, వెంకునాయుడు. రథయాత్ర నిర్వహించే హక్కు వెంకునాయుడికి కాకుండా గంగరాజుకి వుందని కోర్టు తేల్చి చెప్పింది. కోర్టు కారణాలవల్ల రెండు సంవత్సరాల నుంచి ఆగిపోయిన రథయాత్ర ఈ సంవత్సరం గంగరాజు నాయకత్వాన మొదలయింది. ఈ రథయాత్ర వెనకాల ఎన్నికలు కూడా వుండటం వల్ల గంగరాజు ఈసారి వైభవంగా మొదలుపెట్టాడు. జగన్నాథ రథ చక్రాలు కదిలాయి, జనం వారి వారి భక్తిని, ప్రదర్శించుకుంటున్నారు. మరోపక్క వెంకునాయుడి పార్టీవాళ్ళు ఈ యాత్రని భగ్నం చెయ్యాలని పట్టుదలగా వున్నారు. ఈలోపు రథచక్రాలు ఆగిపోయాయి. మామూలుగా వుండాల్సిన ఢక్కావాడు రథం మీద లేకపోవటమే కారణమని తెలుసుకుని ఢక్కావాడ్ని తీసుకురావటానికి వెళ్తారు. అరవై సంవత్సరాల ఢక్కావాడు రెండు సంవత్సరాలనుంచి రథయాత్ర లేని కారణంగా మరింత దరిద్రంలో వుంటూ, కొడుకుని పోగొట్టుకుని, తాగుడుకి అలవాటై వుంటాడు. గంగరాజూ వాళ్ళు వెళ్ళగానే తన గోడు వెళ్ళబోసుకుంటాడు. ఆనవాయితీ ప్రకారం ధర్మకర్తలు ఢక్కావార్ని బ్రతిమాలి బేరమాడ, అలంకరించి బాజాభజంత్రీలతో తీసుకువస్తారు, ఆ రోజు ఢక్కావాడి పని బూతులు తిట్టడం మళ్ళీ రథచక్రాలు కదిలాయి, ఢక్కావాడి బూతులికి పాటలకి జనం నవ్వటం మొదలయింది, కాస్త దూరం వెళ్ళగానే అల్లరి మొదలయింది. కారణమైన వెంకునాయుడి పార్టీవాడిని చితకకొట్టి పంపించేస్తారు. మళ్ళీ రథచక్రాలు కదిలాయి. ఢక్కావాడు ఎదురుగా వెళ్ళి దేవుడ్ని నిలవేసి మాటల్లోపడి కడిగేస్తాడు. కొడుకు చచ్చిపోయిన బాధలో ఢక్కావాడు ఏవేవో మాట్లాడుతున్నాడు. నిషాలో వున్నాడని రథం వెనకాల పడుకోబెట్టారు. రథం కదుల్తూనే వుంది చీకటి పడింది. ప్రమిదలు వెలిగించారు.

రథం గుడిసెన్న గుడికి దగ్గర్లో వుంది. ఈలోపు జనం మధ్యలో సోడా బుడ్డి పేలింది. ఇందాక దెబ్బతిన్న వెంకునాయుడి పార్టీవాడు సైకిల్ చెయి న్తో వీర విహారం చేస్తున్నాడు, రెండు పార్టీల మధ్య కొట్లాట. రక్త పాతం, తర్వాత పోలీసులు దిగారు. కర్ఫ్యూ విధించారు, నాయకుల్ని నిర్బంధించారు. జనం పారిపోయారు. ఢక్కా వాడు రథానికి ఉరేసుకుని చని పోయాడు. శవాన్ని అంబులెన్స్ తీసుకుపోయింది. రథాన్ని పోలీసువాళ్ళు గుడెసెన్న గుడికి తోసుకుపోయి తాళం వేశారు. ఆ తర్వాత నాయకులు విడుదలయ్యారు. ప్రతి సంవత్సరం రథయాత్ర సాగుతూనే వుంది. నాయ కులు ఎన్నిక అవుతూనే వున్నారు. కొత్త రథం వచ్చింది. కాని ఢక్కా వాడు మాత్రం రాలేదు. అతని పాటలు, ఏడుపులు అర్ధరాత్రివేళ జనానికి వినిపిస్తుంటాయట.

ఈ కథలో విషాదాంత నాయకుడు ఢక్కా వాడు. తను నమ్ముకున్న వృత్తి కూడు పెట్టలేదు, తనునమ్ముకున్న దేవుడు కూడా అలాగే చేశాడు. తను ఆశలు పెట్టుకున్న కొడుకు అర్ధాంతరంగా కూలిపోయాడు. గంగరాజు వెంకునాయుడు బాగానేవున్నారు. వారి పూజలందుకుంటున్న జగన్నాధుడు కూడా బాగానే వున్నాడు. బలైపోయింది ఢక్కా వాడు. ఢక్కా వాడు గంగ రాజుతోను, జగన్నాధుడితోనూ అన్న మాటలు పేగులు తోడేస్తాయి. ఆ మాటలు సమాజంలోని చీకటికోణాల మీదికి విసిరిన విల్లంబులు.

దేవుడి పేరుతో జరిగే తంతు, ఆ తంతులోని భాగస్వామ్యం, ఆ భాగస్వామ్యంలోని ఫలితం - ఇలా 30 పేజీల్లో సాగిన కథానవల వర మేధం. విషాదగీతంలా సాగిన ఢక్కా వాడి జీవితం ఈ కథకి కేంద్ర బిందువు. దానిచుట్టూ సమాజం, దానిలోని కల్మషం. కర్క శత్వం అల్లుకునుంటాయి.

ఇవీ అల్లం శేషగిరిరావుగారి కథలు. ఇందులో 1967 నుంచి 1979 వరకు రాసిన ఏడు కథలున్నాయి. అడవితోను, వేటతోను గాథ

సంబంధంవున్న కథలు - మృగతృష్ణ 'ది డెత్ ఆఫ్ ఎ మేనేటర్' పులి చెరువులో పిట్టల వేట. జంతువుని, చేపని తీసుకుని సింబాలిగ్గా మానవజీవితం గురించి చెప్పినకథలు వలడు, జాతికుక్క, అశ్వమేధం ఇక నరమేధం హూ త్రి నరవాసనవున్న కథ. ఒక రకంగా ఈ కథ ఈ కథల సంపుటిలో చేర్చకుండా వుంటే బాగుండేది. అలాగే ఈ కథలు కాల క్రమంలో అచ్చువేసివుంటే రచయిత పరిణామం, పరిణతి తెలుసు కోవటానికి అవకాశం వుండేది.

ఈ కథల్లో - పులులు, తోడేళ్ళు, జింకలు, దుప్పులు, అడివి పందులు, కణుసులు, చిలకలు, కాకులు, దోమలు, నెమళ్ళు, కత్తిరిపిట్టలు, అడివికోళ్ళు, కొండగొర్రెలు, కొండ ముచ్చులు, రేచుకుక్కలు, వలడు, గుడ్లగూబలు, కోతులు, ఏదుపందులు, ఎలుగ్గొడ్డు, చిరుతపులి, అడివిదున్న, పిగిలి పిట్టలు, రాబందులు, గెద్దలు, దుమ్ములగొండు, కొంగలు, బాతులు, తీతువులు, ఉల్లంకిలు, దాసరికోడి, రెయ్యికాళ్ళ పిట్టలు, నత్తగోట్లం - ఇలా మొత్తం జంతు, పక్షి ప్రపంచం అంతా దర్శనమిస్తుంది. ఈ కథల్లో ఈ జంతువుల,పక్షుల శబ్దాలతోపాటు, మృదంగ, జేగంటల శబ్దాలు కూడా అత్యంత సహజంగా శేషగిరిరావుగారు రికార్డు చెయ్యటం ఆయన నిశిత పరిశీలనకు నిదర్శనం.

ఈ కథలన్నీ చివరికి విషాదాంతాలే అయ్యాయి. ముఖ్య పాత్రలన్నీ మృత్యు కవుగిలిలోనో, మృత్యు వాకిటిలోనో వున్నాయి - కొన్ని చచ్చి పోయి, కొన్ని బతికిపోయి.

ఈ కథల్లోని బైరిగాడు, చిన్నయ్య, కనకరాజు, రంగారావు, రాజా, రఘునాధరావు, ఒంటిబాతు, సరళ, ధక్కువాడు మనల్ని వెంటాడుతూనే వుంటారు.

ఈ కథల్లో అట్టడుగు జీవితమే కాకుండా హైక్లాసు జీవితం కూడా పరుచుకునుంది. రచయిత బాధితుల పక్షాన కలం తుపాకీ పుచ్చుకుని

నిలబడతాడు. అనవసరమైన సిద్ధాంత చర్చలు చెయ్యలేదు. పాత్రల జోలికి కావాలని వెళ్ళలేదు. తనకు తెలిసిన జీవితాన్ని కరుణ రసాత్మకంగా, కథల రూపంలో రాశాడు.

ఈ కథల్లో గుర్తుండే వాక్యాలు......... మనసులో బొమ్మలు చిత్రించుకుని మాసిపోకుండా వుంటాయి.

మృగతృష్ణలో బైరిగాడి గురించి "అరవై సంవత్సరాలు నిండిన బైరిగాడి ముడతలు దేరిన ముఖం బీటలు పడ్డ నేలలా వుంది."

"బైరిగాడు నడుస్తూంటే దిష్టిబొమ్మ తుపాకీ పట్టుకుని అడివిలో నుంచి నడుస్తున్నట్టుంది."

ది డెత్ ఆఫ్ ఎ మేనీటర్‌లో వెన్నెల గురించి "చింతచెట్టుమీద వెన్నెల ఆకులమీద వెండి జల్లినట్లుంది."

జాతికుక్కలో కొడుకు వెంటేసుకు తిరుగుతున్న ఊరకుక్క గురించి భార్య చెబితే అప్పుడు "రంగారావు మెడమీద గుప్పెడు గొంగళిపురుగులు పాకుతున్నట్టయింది."

ఊరకుక్క గురించి "ఎండిపోయిన తెలగపిండిలాంటి అసహ్యమైన రంగు"

పులిచెరువులో పిట్టల వేటలో బాతులు మందగా రావటం గురించి "దూరానికి మబ్బు కదిలి వస్తోందా అన్నట్టుగావుంది."

కుక్కల వ్యతిరేకి అయినా తండ్రి దగ్గరకు కూతురువచ్చి కుక్క పిల్లని పెంచుకుందాం నాన్నా అన్నప్పుడు "కాళ్ళలోపాము పడినట్టు తుళ్ళిపడి లేచాడు."

అశ్వమేధంలో రాజారావు గురించి "రాజారావు నెరసిన తల మరీ తెల్లగాను, ముఖం నల్లగాను ఫోటో నెగిటివ్‌లా ఉంటాడు" "పౌడరు అద్దుకున్న అతని ముఖం బూజుపట్టిన గొడుగు గుడ్డలా ఉంది."

ఈ కథల్లో అక్కడక్కడ ఇంగ్లీషు వాక్యాలకి వాక్యాలే వచ్చేసి - పులికోసం చూస్తుంటే పిల్లులు తటస్థపడినప్పటి చిరాకు కలుగుతుంది.

"జాతికుక్క" లో వచ్చిన "మెడమీద గుప్పెడు గొంగళిపురుగులు పాకుతున్నట్టయింది" అన్న వాక్యం పులిచెరువులో పిట్టలవేట కథలో కూడా వచ్చింది.

అలాగే పులిచెరువులో పిట్టలవేట కథలో వచ్చిన "కాళ్ళలో పాము పడినట్టు తుళ్ళిపడి లేచాడు" అన్న వాక్యం అశ్వమేధం కథలో కూడా వచ్చింది.

ఇలాంటిదే మరో విశేషం కూడా కనిపిస్తుంది. జాతికుక్కలోను. పులిచెరువులో పిట్టలవేటలోను స్త్రీ పేరు "సరోజిని" కావటం కేవలం యాదృచ్ఛికం.

మృగతృష్ణ కథ ఎండాకాలంతోను, వఱదు, ది డెత్ ఆవ్ వి మేనీటర్, జాతికుక్క. పులిచెరువులో పిట్టలవేట, అశ్వమేధం కథలు చలి కాలంతోను సంబంధం కలిగి వుంటాయి.

ఈ కథల్లో పాత్రల సంభాషణలు చాలా తక్కువగా కనిపిస్తాయి. కథలు కాస్త పెద్దవిగా కనిపిస్తాయి వాతావరణ చిత్రణలో శేషగిరిరావు గారు చాలా మెలకువలు తెలిసిన అనుభవజ్ఞుడైన రచయితగా దర్శన మిస్తాడు. కొన్ని కథలు కట్టడం అంత పగడ్బందీగా లేకపోయినా, చెప్ప దలుచుకున్న విషయం మాత్రం స్పష్టంగా వుంది. అప్పుడప్పుడు కథలు రాయటం కాకుండా తరచుగా కథలు రాస్తే మరింత పరిణత సాధించగలదని ఈ కథలు సాక్ష్యం ఇస్తున్నాయి.

ఆధునిక తెలుగు కథలో అడివిని, వేటని నేపథ్యాలంకారాలుగా చేసి మానవ జీవితాన్ని చిత్రించటమే కొత్త. ఈ కొత్త మంచిముత్యాల కూర్పరి శ్రీ అల్లం శేషగిరిరావుగారు.



-: సమాప్తం :-